| విషయము. | | పుట. |
|---|---|---|
|  |

శ్రీః

శ్రీ గణేశాయ నమః

శ్రీ శారదాంబాయై నమః

శ్రీ [illegible] శ్రీ గోపాలకృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర వచనమహాభారతము



## ఆదిపర్వము

శ్లో. అభ్రశ్యామః పింగజటాబద్ధకలాపః
ప్రాంశుర్దండీ కృష్ణమృగత్వక్పరిధానః,
సాక్షాల్లోకాన్ పావయమానః కవిముఖ్యః
పారాశర్యః పర్వసు రూపం వివృణోతు.

శ్లో. *నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్,
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్.

సకలలోకములను సృష్టికర్తయగు శ్రీమన్నారాయణునకును బురుష శ్రేష్ఠుం డగు నరునకును సకలవిద్యాప్రదాయిని యగు శ్రీశారదాంబకును నతు లొనర్చి పిదప జయమును బలుకవలయును.

---

* పూర్వము పరమాత్మయే నరనారాయణు లనునిద్దఱు మహర్షులుగ నవతరించెను. తరువాత నా నరనారాయణులే శ్రీకృష్ణార్జునులుగ నవతరించి రని మహాభారతమున నిట్లు శ్లో. 'ఏవముక్త్వా మహాత్మానమాత్మా కృష్ణస్య పాండవః, తూష్ణీమాసీత్తతః పార్థ

చినయుంటట సూతునకుఁ దెలియుటను తెలిసినవారై యాతనివలనఁ బుణ్యకథలు వినఁగోరి యాతనితో నిట్లు లనిరి. "ఓసూతనందనా! యెక్కడనుండి వచ్చుచున్న వాఁడవు? నీరాకచే మేము కృతార్థులమైతిమి. నీవలన నేవేని పుణ్యకథల వినఁగోరుచున్నవారము." అని యడుగ నాతం డిట్లనియె. "ఓమహర్షులారా! భూలోకమునఁ బరీక్షిత్సుతుం డగు జనమేజయుఁడు సలిపిన సర్పయాగమున ఋషివర్యుండగు వేద వ్యాసుఁడు రచించిన మహాభారతమునందలి కథలను నాతనిశిష్యుండు వైశంపాయనుం డనుమునివర్యుండు వివరింప విని, పెక్కుతీర్థములు సేవించి, పాండవులకును ధార్తరాష్ట్రులకును రణరంగం బగుశమంతక పంచక మనుపుణ్యభూమిని దర్శించి మిమ్ముఁ గనుఁగొన నిందుల కేతెంచి తిని. ఈయాగశాలలో సూర్యాగ్నులతో నెన యగుతేజస్వులును, బరమపుణ్యమూర్తులును నగుమహాఋషు లందఱును దమతమ తపస్సులను నిర్విఘ్నముగ నాచరించుచు సురక్షితులుగ నున్నవారలు గాదె? నావలన నెద్ది వినవలతురు? ధర్మార్థములతోఁ గూడుకొనియుండు నేయితిహాసములను, నేరాజులసచ్చరిత్రనంబులను, నేమహర్షులమహిమలను జెప్పువాఁడ నానతిం డనిన నమ్మును లిట్లనిరి.

ఓసూతుఁడా! ఏయది జనమేజయుఁ డాచరించుచుండిన సర్ప యాగకాలమునందు వేదవ్యాసానుమతంబడసి యాతని శిష్యుండగు వైశంపాయనునిచే వివరింపఁబడినదో; ఎద్ది వ్యాసమహర్షిప్రణీతమైనదో; ఎయ్యది యనేకవేదశాస్త్రార్థములను నీతిసారములను దెల్పునో; దేనిని వినిన బాపములు శమించునో; ఏది యిహపరసాధకమో, దేనిని విను టచే ధర్మములు సమకూడునో యట్టి శ్రీమహాభారతసత్కథను విన వలతు మనిరి. అప్పుడు సూతుం డాదిపురుషుండును, నీశ్వరుండును, యజ్ఞభోక్తయును, సామవేదములచే స్తుతింపఁబడువాఁడును, సత్యుం డును, నేకాక్షరుండును, వ్యాపకుండును, బ్రహ్మస్వరూపుండును, వ్యక్తా వ్యక్తుండును, సనాతనుండును, విశ్వవిరాట్స్వరూపుండును, సదసత్తులకుఁ బరుండును, సర్వమును సృష్టించినవాఁడును, బురాణుండును, బరుండును, నవ్యయుండును, మంగళముల నొసఁగువాఁడును, మంగళస్వరూపుం డును, యజ్ఞాత్ముండును, వరణీయుండును, వనఘుండును, స్వభావశుద్ధుం

డును, జరాచరములకు గురుండును, సర్వేంద్రియనియామకుండును, జననమరణస్వరూపమైన సంసారము నివర్తింపఁజేయువాఁడును నగు పురుషోత్తమునకు నమస్కరించి, భగవంతుఁడును, సకలసుగుణశోభాసంపన్నుఁడును, శ్రీమహాభారతసత్కథారచయితయు నగు వేదవ్యాసునకుఁ బ్రణామిల్లి యామహనీయునికృపచే జగదీశ్వరుం డగు శ్రీమన్నారాయణుని కథను నిట్లని చెప్పందొడంగెను.

ఓమునిశ్రేష్ఠులారా! సావధానులరై వినుండు. సర్వపుణ్యభూములు మెట్టుటయు, సర్వపవిత్రతీర్థస్నానాచరణంబును శ్రీమన్నారాయణుని పుణ్యకథవినుటకు సరి గానేరవు. నారాయణకథ వినుటవలనఁ గలుగుఫలము నితరమగు నెద్దానను నరుండు పొందలేఁడు. భూతభవిష్యద్వర్తమానకాలములలో శ్రీమన్నారాయణునకు సమానుండు లేఁడు. ఆతని సత్యవాక్యమును నుడువునంతమాత్రమున సర్వార్థంబులను మనుజుఁడు సాధింపఁగలఁడు. అట్టి లోకోత్తరపురుషునికథ శ్రీమహాభారతమున నుడువఁబడుచున్నది. కావున నిప్పుడు మీ కిష్టమగు నామహాభారతపుణ్యకథను జెప్పెద. అయ్యది త్రికాలములయందును బ్రచారమునుబడయుచుండును. మఱియు నీయితిహాసము నిఖిలజ్ఞానసాధకము, సకలవేదార్థసారము; సర్వలక్షణసమన్వితము; సకలార్థప్రదాయకము; సందర్భోచితములగు ససుశబ్దములతో నలంకరింపఁబడినది. విద్వాంసులకుఁ బ్రీతిం గల్గించు నానావిధఛందోవృత్తములతోఁ గూడి మిక్కిలి నుతి కెక్కి యుండును.

పూర్వకాలమునందు మహనీయుం డగుకృష్ణద్వైపాయనుండు వేదములను నాల్గుగ విభజించి కొండొక కాలమునకు, హిమవత్పర్వత ప్రాంతమున కేగి యామహాగిరిగుహాలయం బొక్క ప్రదేశమున శుద్ధుం డై దర్భాసనము వైచికొని దానిపైఁ గూర్చుండి పరమశాంతమూర్తియై, నియమముతోఁ దపం బాచరించుచుండ నాకాలమున నామహనీయుని సచ్చారిత్రవిశేషంబునం జేసి యాతనికి దివ్యదృష్టి గలిగెను. అప్పుడాదివ్యజ్ఞానంబున నాపుణ్యాత్మునకు సృష్టిమొదలు బ్రహ్మాండంబును, సమస్తమునకుఁ గారణభూతుం డగుపరబ్రహ్మయును, బ్రహ్మవిష్ణుమహేశ్వరులును, వారియంశములయందుఁ బుట్టినవారును, మనువులును, వసువులును, నేకాదశరుద్రులును, సూర్యచంద్రాదులును, సప్తర్షులును,

రాజర్షులును, బంచమహాభూతములును, తదంశసంభూతము లైన సకలచరాచరవస్తుజాలములును, వేదములును, వేదాంతములును, సర్వోపనిషత్తులును, సకలేతిహాసములును, బురాణములును, ధర్మార్థకామశాస్త్రములును, బుణ్యాత్ములగు భూసురులును, ధర్మపరు లగుక్షత్రియులును, సంవత్సరములును, మాసములును, ఋతువులును, బక్షములును, నహోరాత్రములును, బ్రపంచలక్షణముగల సకలవిషయములును గోచరింపఁగాఁ దత్పూర్వము తనకుఁ దల్లి యగుసత్యవతియును, గాంగేయుండును ననుమతిసేయ విచిత్రవీర్యునిభార్య లగునంబికాంబాలికలయందుఁ ద్రేతాగ్నులవలెఁ బుట్టించిన పుత్త్రులగు ధృతరాష్ట్రపాండురాజవిదురులు, వృద్ధులై మరణించినవెనుక సర్వవేదార్థముల సంక్షేపముగ నిమిడ్చి విద్వాంసులమనంబు లానందమునం దోలలాడ నీమహాభారతేతిహాసమును రచియించెను.

ఇట్టి మహాగ్రంథమును వెల్లడిపఱచి ప్రపంచమున నుండు జనులచే నెట్లు చదివించువాఁడ నను తలంపుతో నాలోచించుచుండ, లోకహితార్థము బ్రహ్మదేవుండు బాదరాయణునికడ కేతెంచెను. అప్పు డామునివర్యుండు పరమేష్ఠిం గని లేచి నిలుచుండి యమ్మహానీయునకు సాష్టాంగవందనము లాచరించి యాసనము నొసంగఁగాఁ బితామహుఁడు తాను నాసీనుండై తనచెంగటఁ గృష్ణద్వైపాయనునిఁ గూర్చుండు మని సెలవొసంగెను. అప్పుడు వేదవ్యాసుండు పరమేష్ఠితో సవినయముగా నిట్లని వచించె." మహానుభావా! నేను సకలవేదవేదాంతపురాణేతిహాసములను సంగ్రహించి యిమ్మహాభారత మను నితిహాసమును రచించితిని. కాని, దీనిని లోకులు చదివి యానందించుటకు వ్రాతవ్రాయువాఁ డొకఁడును నాకు గానరాఁ డని విన్నవించెను. అంత నా నలుమొగంబులవేల్పు "ఓసాత్యవతేయా! నీజ్ఞానంబు నే నే మని చెప్పువాఁడ! సప్తర్షులలో నొక్కండై యతులతపఃప్రభావంబునం జేసి వరిష్ఠుండైన వసిష్ఠునికంటె సకలవేదవేదాంతరహస్యభావముల నెఱుంగుటలో నీవు శ్రేష్ఠుండవు. నీవు పుట్టినది మొదలు నీ వాడు మాట లన్నియు పరబ్రహ్మ యాథార్థ్యంబును నిరూపించు ననియు, సత్యము లనియు నే నెఱుంగుదు. అటు లుండ నీవు రచించిన యీ మహా

భారతేతిహాసమును ధర్మశాస్త్రజ్ఞులు ధర్మశాస్త్రమనియు, నధ్యాత్మవిదులు వేదాంతమనియు, నితిహాసవేత్త లితిహాసమనియుఁ, బౌరాణికులు బహుపురాణ సముచ్చయమనియుఁ గవివృషభులు మహాకావ్యమనియు, లాక్షణికులు లక్ష్యసంగ్రహ మనియుఁ గొనియాడుట యొకయద్భుతంబే. ఇట్టి చతురవర్తనలచే నొప్పు నీగ్రంథరాజము మహాకావ్య మనఁబడుఁగాక! ఆశ్రమధర్మములలో నితరములగు నాశ్రమధర్మములు గృహస్థధర్మము నతిక్రమింపఁజాలనట్లు తక్కిన కవులకావ్యములు నీకావ్యమును మించఁజాలవు. దీనిని వ్రాయుటకు విఘ్నేశ్వరుని బ్రార్థింపు మని వచించి పితామహుండు సనియె. అంతఁ గృష్ణద్వైపాయనుండు గణాధిపతిని ధ్యానింపఁగా నాదేవుం డాఋషివర్యునకుఁ బ్రత్యక్షం బయ్యె. పారాశర్యుండు నావిఘ్నరాజుం బూజించి యాసనమిచ్చి సుఖాసీనుండఁ జేసి యిట్లనియె. "లంబోదరా! నేను మనస్సునం దొకగ్రంథమును రచించి యున్నవాఁడ. నీవాగ్రంథమును నేను జెప్పుచుండఁగా లేఖినిఁ గొని పత్రములపై వ్రాయవేఁడెద." అని ప్రార్థింపఁగా నాసురశ్రేష్ఠుం డమ్మునిశ్రేష్ఠున కిట్లనియె. "ఋషివర్యా! నీవుకోరినందులకు వ్రాయఁబూనెదను, కాని నేను వ్రాయుచుండఁగా నాలేఖిని యొకక్షణమైనను నిలుపుటకు వీలుగాకుండ, నీ వాశుధారగా గ్రంథమును జెప్పుచుండవలయును.-ఈయేర్పాటున కొడంబడియెదవేని నీప్రార్థన నంగీకరించెద" నని తెలిపెను. అది విని సాత్యవతేయుండు "నేను గావ్యమును జెప్పుచుండఁగా నీవు వ్రాయునపుడే కావ్యార్థమును బోధచేసికొనుచుండవలయును" అని పలుక వినాయకుం డందుల కొప్పుకొనెను. ఇట్లు గణపతి యొడఁబడఁగా, వ్యాసుఁడు షష్టిలక్షశ్లోకములతో నొప్పారు నీయితిహాసమును జెప్పుచు వ్రాయించెను. పిదప దీనిని నారదుఁడు దేవలోకమునను, నసితుండగు దేవలుండు పితృలోకమునను, శుకమహర్షి గంధర్వాదిలోకములయందును, వైశంపాయనుండు భూలోకమునందు జనమేజయుఁ డాచరించిన సర్పయాగకాలమునను జెప్పిరి. అట్లు వ్యాసప్రణీతమైన నీ పవిత్ర మగు మహాభారతేతిహాసము సర్వలోకములయందుఁ బ్రశస్తిఁ జెందెను.

ఈ గొప్పయితిహాసమునందుఁ గురువంశవిస్తారమును, గాంధారి యొక్క ధర్మశీలత్వమును, విదురుని ప్రజ్ఞయుఁ, గుంతీదేవి ధైర్యమును

వాసుదేవుని మాహాత్మ్యంబును, పాండుకుమారుల సత్యనిరతియును, దుర్యోధనాదుల దుర్వృత్తమును, వేదములు నాల్గింటియొక్కయు, నుపనిషత్తులయొక్కయు సర్వార్థరహస్యములును, నింకను ననేక పుణ్యతీర్థములయొక్కయు, మహాపర్వతములయొక్కయు వర్ణనలును విశేషంబుగ నిరూపింపఁబడెను.

ఈ గ్రంథరాజమున నెనిమిదివేలు నెనమన్నూరుశ్లోకముల భావము వేదవ్యాసుండును నాతనిపుత్రుం డగు శుకమహర్షికిందప్ప నితరుల కెవ్వరికని దెలియ దనియు, సంజయునకుఁ దెలియునో తెలియదో సందేహ మనియు వేదవ్యాసులే చెప్పియున్నారు. మహానుభావుం డగు వినాయకుండు వ్రాయుచుండునపుడు ప్రతిశ్లోకార్థము నాలోచించి గ్రహించినఁగాని వ్రాయుట లేదంట! లోకమంతయు జడాంధబధిరోన్మత్తతమోభూయిష్టంబై యున్నయది. ఆ తమము జ్ఞానాగ్నిచేఁ బ్రకాశింపఁజేయంబడి యావలికిఁ దసంతఁ దొలఁగుచున్నది. కావున జ్ఞానముచేఁ దెలివిని వికసింపఁజేసి యజ్ఞాన మనుచీఁకటిని నావలికి నెట్టివలయును. అంతియఁగాక యీమహాభారత మను భానుండు ధర్మార్థకామమోక్షములను సకలపురుషార్థముల లెఱం గెఱింగించి లోకుల తమోగుణ మను నంధకారమును దొలఁగఁద్రోలును. మఱియును భారత మను చంద్రుండు వేదార్థరహస్యములను వెన్నెలలచే వెలువఱిచి లోకుల బుద్ధులను వికసింపఁజేసెను. భారత మను దీపకళికప్రపంచ మను నంతర్గృహంబు సొచ్చి యచ్చోటు నావరించి యుండుమోహమును నావలికి నెట్టి దేదీప్యమానమై ప్రకాశించును. ఈపవిత్రగ్రంథమునకుఁ గొందఱు ఆది "నారాయణంనమస్కృత్య" యనుశ్లోకమును బఠింతురు. మఱికొందఱు "శౌనకః- కిమస్మిం రాజశార్దూల స రాజా జనమేజయః, సర్పసత్రేణ సర్పాణాం గతోఽంతం తద్వదస్వ మే" అను ఆస్తీకపర్వాదిశ్లోకమునుబఠింతురు. ఇంకను గొందఱు "వైశంపాయనః—రాజోపరిచరో నామ ధర్మనిత్యో మహీపతిః" అను నఱువదిమూఁడవయధ్యాయము ప్రారంభమున నుపరిచరవసుచరిత్రమును జదువుదురు. ఈవిధమున సర్వలక్షణములతోఁగూడిన యీ భారతేతిహాసగ్రంథరాజము సకలజనులచే నుతింపఁబడుచు, దేవలోకమునందలి కల్పసాలంబుమాడ్కిఁ జెన్నారుచున్నది. ఈగ్రంథ

ములో నెచ్చుపురుషులలో దుర్యోధనుండు క్రోధమయమహావృక్షముగను, కర్ణుండు వృక్షముయొక్క మధ్యభాగముగను, శకుని యాచెట్టుకొమ్మ గను, దుశ్శాసనుండు ఫలములు పుష్పములుగను, జీవుండగు ధృతరాష్ట్రుఁడు వేరుగను నిరూపింపఁబడియున్నారు. ధర్మపుత్రుండు ధర్మమయమగు మహా పారిజాతవృక్షముగను, నర్జునుం డాచెట్టునకు మధ్యముగను, భీమసేనుండు దాని కొమ్మగను, నకుల సహదేవులు పుష్ప ఫలములుగను, శ్రీకృష్ణ భగవానుఁడు వేదములును భూసురులును మూలముగను భావింపఁబడి యున్నారు. తొలుత నీమహాభారతేతిహాసమును సంగ్రహముగా నుడివి, పిదప విస్తరించి విపులముగాఁ జెప్పుటకుఁ బూనెద నని చెప్పి సూతుం డిట్లనియె.

ఈ భారతగ్రంథము పుణ్యకర్తలచరిత్ర గలదై లక్షశ్లోకముల తో నలరారుచున్నది. ఈలక్షశ్లోకములును ఉపాఖ్యానసహితములగు. ఉపాఖ్యానములు గాక భారతకథమాత్రము ఇరువదినాల్గువేలశ్లోకముల తోఁ జెప్పఁబడియున్నది. పర్వాంతఃపర్వముల కనుక్రమణికాధ్యాయము పర్వమును బాదరాయణుఁడు రచించి మొదట గ్రంథమునంతయు బుత్రుఁ డగు శుకున కుపదేశించి చెప్పెను. ఈగ్రంథరాజ మపరిమితమైన శ్లోకములతో రచింపఁబడినది. అందు ముప్పదిలక్షల శ్లోకములతో విరాజిల్లు గ్రంథము దేవలోకమున నారదుండు ప్రకట పఱిచెను. పితృలోకమునకుఁ జేసిన భారతగ్రంథము పదునైదులక్షల శ్లోకములు గలదై యది యాలోకమున నసితుండైన దేవలునిచేఁ బ్రక టితమైనది. గంధర్వయక్షరాక్షసలోకములకుఁగాను గావింపఁబడిన భారతగ్రంథము పదునాల్గులక్షలశ్లోకములతోఁ గూడి యాలోకము లలో శుకమహర్షిచే వెలువరింపఁబడినది. మనుష్యలోకప్రచారమునకుఁగా నీమహాభారతము లక్షశ్లోకములలో నిమిడ్చి యద్దాని నీలోకంబున వైశంపాయనునిఁ బ్రకటింపు మని నిర్దేశింపఁగా నమ్మహర్షి దీనిని జనమేజయుఁడు గావించుచున్న సర్పయాగకాలములో వెలువరించఁగ నద్దానిని విని నే నిచ్చోటి కేతెంచితి. ఇట్టిగ్రంథరాజము నాల్గువిధము లుగా నలువదిలక్షల శ్లోకములతో శ్రీకృష్ణద్వైపాయనుండు రచి యించెను.

## భారతకథాసంగ్రహము

పాండురాజు నిజవీర్యముచేతను, బుద్ధిచేతను నానాదేశములను గెలిచి రాజ్యమును వృద్ధిపఱచి, భూమండలమును ధర్మమార్గమునఁ బాలించుచుండెను. అంత నాతఁ డొక్కనాఁడు వేటనిమిత్త మరణ్యమునకుఁ బోయి యచట నొకప్రదేశమున నొకమహర్షి మృగరూపధరుండై యొంటిమైఁ దనభార్యతో సంగమించుచుండ వానిని యథార్థమృగముగాఁ దలంచి బాణముతోఁ గొట్టెను. అంత నాముని యారాజునకు మరణావస్థ నొంది "ఓరాజా! నీవును స్త్రీతో సంగమింప నారంభింపఁగనే చచ్చెద" వని శపించెను. అంతఁ బాండురాజా శాపమునకు భీతుఁడై వనమునందే వసించుచుండెను. అప్పుడా రాజుభార్యలగు కుంతి, మాద్రి యనువారలునైత మాతనితో నాయరణ్యాశ్రమములలో వసించుచుండిరి. వారిలోఁ గుంతీదేవికి నామెచిఱుతప్రాయంబునఁ బుట్టినింట నుండఁగా దుర్వాసుఁ డుపదేశించిన మంత్రప్రభావంబున ధర్మదేవతయనుగ్రహంబున యుధిష్ఠిరుఁడును, వాయుప్రసాదంబున భీమసేనుండును, నింద్రునివలన నర్జునుండును, దుర్వాసుండు తన కుపదేశించిన మంత్రమును గుంతి మాద్రికి నుపదేశించుటచే నాదేవియందు దేవవైద్యులగు నశ్వినీదేవతలవలన నకుల సహదేవులును బుట్టిరి. ఇట్లీనైదుగురు కొమారులును పెద్దలచేతను నాశ్రమవాసులగు తాపసులచేతను బోషింపఁబడుచుఁ గ్రమంబునఁ బెద్దవారగుచుండిరి. ఇట్లుండఁ బాండురాజు శతశృంగం బను ప్రదేశంబున మాద్రితో విహరించుచు నద్దేవి శృంగారలావణ్యంబుల కోడి యగ్గలంబైన మదనవికారంబునం బడి, యామెను గవిసి మునిశాపంబుచే కాలధర్మము నొందెను. పదంపడి యచ్చోటిమునులు యుధిష్ఠిరాదులగు నైదుగురుకొమాళ్లఁ దోడ్కొని హస్తినాపురమునందున్న ధృతరాష్ట్రుపాలికి వచ్చి వారిం జూపి "వీరు పాండురాజుపుత్త్రులు, బాలురు, సుకుమారులు, జడలు దాల్చి బ్రాహ్మణవేషధారులై బ్రహ్మచర్యమును జలుపుచున్నవారు. నీవు వీరి యందుఁ బుత్త్రవాత్సల్యమును నెఱపుము. స్నేహమునం జూపుము" అని చెప్పి వా రంతర్హితులైరి. అంతఁ గౌరవులలోఁ గొందఱును బురజనులు

కొందఱును, నీబాలురరాకకు సంతసించిరి. మఱికొందఱు వీరు పాండుపుత్రులు కారనిరి. ఇంక కొందఱు పాండురాజునకుఁ బుత్రులెట్లు గలరు? ఆతండు మృతుండై పెద్దకాలం బయ్యె. ఈబాలు రెవ్వరో యని సంశయించిరి. ఇవ్విధంబున నొకటి కొక మాటగాఁ జెప్పుచుండఁ బంచభూతంబులును నేరికిం గానరాక వీరు నిక్కువంబుగఁ బాండురాజపుత్రులే యనియు, వీరి నవశ్యము గారవింపవలయు ననియు నంతట నశరీరవాణి చెప్పఁగా ధృతరాష్ట్రుండు వారిం జేరఁదీసి పురజనులు కోలాహలము సేయ నగరంబున వివిధవాద్యశుభధ్వనులు నింగి ముట్ట రాచనగరు ప్రవేశింపఁ నియ్యకొనెను. అంత నారాజపుత్రులును గ్రమంబుగ క్షత్రియోచిత సంస్కారములను బొంది, వేదశాస్త్రాదివిద్యల నేర్చి, ధనుర్విద్యయందుఁ బ్రసిద్ధులై యెల్లవారికిఁ బ్రీతిపాత్రులై మెలఁగుచుండిరి. అప్పుడు పురజనులును, నగరఁ గల రాజబంధువులును యుధిష్ఠిరుని శీలంబునకు, భీమసేనుని ధైర్యసాహసంబులకు, నర్జునుని పరాక్రమంబునకు నకులసహదేవుల వినయగాంభీర్యములకుఁ, గుంతీదేవి [illegible]ణత్వమునకు మనంబుల నలరి వారియెడఁ బ్రీతియుక్తులై యుండిరి. అంతటఁ బాంచాలరాజపుత్రీస్వయంవరము రాజలోకమునఁ జాటింపఁ బడఁగా నాస్వయంవరకాలమున నర్జునుండు సకలరాజలోకసమక్షమున మత్స్యయంత్రమును దన ధనుర్విద్యానైపుణ్యంబునఁ బడగొట్టి కన్యను బరిగ్రహించె. నాటంగోలె నర్జునుండు రాజులలో మేటి ధానుష్కుం డను ప్రఖ్యాతిఁ బొంది యాదిత్యునిలో [illegible] తేజస్వియై విరాజిల్లెను. విలువిద్యయం దితరులకు సాధ్యముగాని ప్రావీణ్యమును గాన్పించుచుండ నర్జునుండు రాజకుమారులలో వాసి కెక్కియుండె. ఇట్లు భుజపరాక్రమదర్పవినయాదులఁ బ్రసిద్ధులైన భీమార్జున నకుల సహదేవులు శీలమును సదాచారసంపత్తియును, ధర్మవేత్తృత్వమును గల జ్యేష్ఠుఁడగు యుధిష్ఠిరునకుఁ గూర్చువారై మెలంగుచు సకలదేశముల రాజులం గెలిచి కానుకలం దెచ్చి యన్న పాదంబుల సమర్పించుచుండ, నతఁడు రాజసూయయాగము నుపక్రమించి తమ్ములోడించిన నానాదేశరాజులు కప్పములు కానుకలు గొని రాఁగా మహావిభవంబుతో నారాజసూయంబు [illegible] సనాథమాను

రులను మృష్టాన్నంబునను భూరిదక్షిణలం దనిపి, యాగసభకు వేదవ్యా సుండు సభ్యుఁడుగా, శ్రీమన్నారాయణుని యపరావతారంబైన శ్రీవాసు దేవుండు భర్తయు భోక్తయుఁగా జన్నము సర్వలక్షణసమన్వితంబుగా నాచరించెను. రాజసూయయాగము సుపక్రమించుటకుఁ బూర్వము వాసుదేవుసహాయంబున భీమసేనుండు బలపరాక్రమశాలి యగు జరా సంధుని మల్లయుద్ధమున నోడించి వధించెను. యాగకాలమున దుష్టుం డగు శిశుపాలుని దేవకీనందనుండు స్వయముగాఁ గీ టడంగించెను. ఇంకను నర్జున నకుల సహదేవులు పెక్కుఱు రాజుల నోడించి వారిచే మణికనకవస్తువాహనముల నసంఖ్యములుగాఁ గొనితెచ్చి యుధిష్ఠిరు భాండాగారమును నింపిరి. ఇట్టి యుధిష్ఠిరుసంపద కోర్వలేక ధృతరాష్ట్ర పుత్త్రులగు దుర్యోధన దుశ్శాసనాదులు వారియెడ నసూయాపరులై వర్తింప నారంభించిరి. రాజసూయయాగకాలమునందు యుధిష్ఠిరు మహావిభవమును జూడలేక యసహిష్ణులైరి. మఱియు నాయుధిష్ఠిరు మహాసభయందు దుర్యోధనుండు పెక్కుబన్నములకుఁ బాల్పడెను. నాన దేశాధిపతులు మదమాతంగతురంగములను, కాంచనాదిలోహములను, నమూల్యంబులైన మణులను, సాగరజనితంబులగు దక్షిణావర్తశంఖ ములను, జిత్రవిచిత్రము లగు మేల్పైనకంబళములను, ననేక దాసదాసీ జనంబులను ధర్మజునకుఁ గానుకలుగా నొసంగిరి. ఈవైభవము నంతను జూచుచుండిన దుర్యోధనుండు యుధిష్ఠిరాదులపై నీర్ష్య జనింపఁ దండ్రి యగు ధృతరాష్ట్రునితోఁ దనమనోవేదన నంతను నివేదించి వారిసంపద నంతను దా నపహరించికొనుట కొకయుపాయం బూహించి యందులకుఁ దండ్రిచే ననుమతిం బడసి ద్యూతంబున సకలమాయోపాయంబులఁ బన్నువాఁ డగుతనమేనమామ శకుని తనకు సాయపడ ధర్మరాజును దుర్ద్యూతంబున నోడించి యాతని సర్వసంపదలను సకలమహీరాజ్యమును నాచికొని తుదకుఁ దమ్ములును భార్యయు వెంటరా నతనిఁ బండ్రెండేండ్లు వనవాసమును నొక్కయేఁ డజ్ఞాతవాసమును జేయుటకు సమయ మేర్ప ఱచి పంపెను. పదంపడి వారు సమయవత్సరములఁ బూర్తిఁజేసి వాసు దేవుని దుర్యోధనసభకు రాయబారిగాఁ బంపి తమమహీరాజ్యభాగము

నిమ్మనఁగా నప్పుడు దుర్యోధనుఁడు భగవంతుఁడగు వాసుదేవునిమహిమను బ్రాకృతుండై తెలియక యామహనీయుని కెగ్గొనరించెను. మఱియును నాసంధిసమయమున సుయోధనునకు రాజబంధువు లగు భీష్మపితామహాది వృద్ధులును, కృపాచార్యద్రోణాచార్యాదిగురువులును, నారదాది మహర్షులును నెన్నియేని హితవచనము లాడి వాసుదేవుసంధికార్యమును ననుకూలపఱుపు మనఁగా నాదురాత్ముండు వారి సంపలుఁ [illegible] నాడెను. అంత వాసుదేవుండు, కినుకఁ బూని పాండవుల సహాయమునకుఁ బురికొల్పి హస్తినాపురిపై నెత్తి విడియుటకు సమకట్టింపఁ [illegible] గురుక్షేత్రంబున ధార్తరాష్ట్రపాండవులకు మహాసమరము ప్రసక్తమయ్యెను. ఆ సమరంబున నుభయపార్శ్వములయందును మేటివిలుకాండ్రును మహావీరులు నగుయోధులు ననేకులు మడిసిరి. కొసకుఁ బాండవులు ఘనాంగణమున దుర్యోధనాదుల నోడించిరి. దుర్యోధనుఁడు తనమిత్రులు తమ్ములనను దనకుఁ దోడుతనుండియు నీసును బెంచిన కర్ణశకునులతోను సస్వర్గము నొందెను. అంత ధృతరాష్ట్రుండు, పాండవుల విజయమును, తనకొడుకుల పరాజయమును, చావును విని దుర్నయులగు దుర్యోధన శకుని కర్ణుల దురాలోచనంబునం గాదె యింత వుట్టె ననే యాత్మగతంబునఁ జింతించి సూతుఁడును దన కాప్తుండును భృత్యుండును నగు సంజయుం జీరి వానితో నిట్లనియె.

సంజయా! వినుము. నీవు మేధావివి. పెద్దలచే మెప్పుఁబొందినట్టి వాఁడవు. నా కీయుద్ధము సమ్మత మైనది కానేరదు. ఈయుద్ధమునకు నామన సొప్పుటలేదు. నాకు నాపుత్రులయెడ విశేషప్రీతియును బాండుపుత్రులయెడఁ బ్రీతి లేమియు లేదు. అసూయాపరులును గ్రోధమూర్తులును నగు నాపుత్రులు నన్నాదరించి వర్తించుచుండినను నే నంధుండనై యుండుటచేఁ బుత్రులయందుఁ దండ్రికుండు సహజప్రేమంబున వారియపరాధముల నోర్చియుండుదు. రాజసూయయాగకాలమునందుఁ బాండవులసంపదను, వారిమహోన్నతిం జూచియుఁ దా నాసభలో నవమానపడుటఁ గాంచియు దుర్యోధనుండు కనలి పాండవులతో యుద్ధమునకుఁ బూని వారిని గెలువ నేరక శకుని కైతవంబున ధర్మద్యూతంబు బాగుట నింతటి హానిం జెందెను. మఱియు నీసందర్భములలో నాయభిప్రాయం

బెట్లుండెనో, వినుము. ఓసూతపుత్రా! వింటివేని నాకుఁ జన్మ చక్షుస్సులు లేకున్నను బ్రజ్ఞాచక్షుస్సుఁ గలవానిగా గుర్తింతువు. కవ్వడి మత్స్యయంత్రమును దెగనేసి పాంచాలిఁ దెచ్చుటయు, నంతఁ బాండవులకుఁ బాంచాలురును శూరసేనులును బంధువులై సాయపడుటకు సంసిద్ధు లగుటయు, మఱియును యాదవరాజుల కుమార్తెయగు సుభద్ర నర్జునుండు పెండ్లియాడుటచే శ్రీకృష్ణుండును సర్వయాదవులును సఖ్యసంబంధములచేఁ బాండవులయెడఁ బ్రీతి యధికముగాఁ జూప నారంభించుటయును, నర్జునుండు తన్ను మహేంద్రుండు వారించినను సరకుసేయక ఖాండవవనంబును నగ్ని కాహుతిగా నొసర్చి శౌర్యము లోకవిఖ్యాతిఁ జెందున ట్లొనర్చుటయును, లక్కయింటియందుండి కుంతీసమేతులై పంచపాండవులును వెలువడుటయును, వారికి విదురుండు తోడగుటయును, మాగధులలో వరిష్ఠుండును బలపరాక్రమశాలియు నగు జరాసంధుఁడు భీమసేనునిచేఁ జిల్పఁబడి చంపఁబడుటయును, పాండుపుత్రులకు లోకములోని రాజు ల్లెల్లరు వశ్యులై యమూల్యకరములను నొసంగఁగా రాజసూయాధ్వరమును యుధిష్ఠిరుం డొడ్డోలగంబునఁ గావించుటయును, నేకవస్త్రయును, రజస్వలయును, గన్నీరు గార్చుచున్నదియు నగు ద్రౌపదిని సభలోనికి దుశ్శాసనుండు తలవెండ్రుకలను బట్టి యాదేవినాథులు చూచుచుండ ననాథంగా నెంచి యీడ్చి తెచ్చి చీర లొలుచుటయును, మాయాద్యూతంబున ధర్మజుండు సౌబలునిచే నోడింపఁబడి యరణ్యవాసమునిమిత్తమై యేఁగుచుండ నాతని తమ్ము లందఱును నాతని వెంబడించి యరుగుటయును, నరణ్యవాసంబు సలుపుచుండ నచ్చోట సైతము బహుబ్రాహ్మణులకు నిత్యసంతర్పణంబులఁ గావించుచు విధ్యుక్తధర్మము లనుష్ఠించుచుండుటయును, నర్జునుండు కిరాతవేషధారి యగు త్రినేత్రుని యుద్ధమున మెప్పించి యాపహాసుభావుని యొద్దనుండి పాశుపతం బను మహానీయాస్త్రంబును గొనుటయును, బదంపడి యాతండు స్వర్గంబునకు మనుష్యశరీరముతో నేఁగి మహేంద్రుఁడు మున్నగులోకపాలకులయొద్దనుండి దివ్యాస్త్రముల సంపాదించి పౌలోమకాలకేయులను హతులఁ గావించి యందులకు బహుమానముగాఁ గిరీటమును గొని మఱలి తనసోదరులం

గలిసికొనుటయును, మనుష్యుల కగమ్యము లగు యక్షు లుండెడు ప్రదే
శములను బాండవులు సొచ్చి యచ్చోటఁ గుబేరునితో గంధమాదన
పర్వతంబున సమాగమముం బొందుటయును సుయోధనుండు ఘోష
యాత్ర కరిగి గంధర్వులకుఁ జిక్కి వియత్తలంబున వారలతని నెత్తికొని
పోవుచుండ, వానిని భార్యలతో ధనంజయుండు విడిపించుటయును,
యక్షప్రశ్నంబులకు యుధిష్ఠిరుండు ధర్మయుతముగా బ్రత్యుత్తరం బొసగుట
యును, విరాటుని యాస్థానమునందు ద్రౌపదీసమేతులై పాండవులు
ప్రచ్ఛన్నరూపములం దాల్చియొరు లెఱుంగకుండ నజ్ఞాతవాసంబు సలుపు
టయును, కౌరవులలో బలపరాక్రమవంతుల నెల్ల నొక్కయర్జునుండ
గోగ్రహణకాలంబున నోర్చి విజృంభించుటయును పాండవు లొక్క
సంవత్సరము ప్రచ్ఛన్నులై తనరాజ్యమునందుండి తనకు సేవ లొనర్చు
చుండినందులకు విరాటుం డదరిపడి, వారితో సంబంధము గావించుకొను
నిమిత్త ముత్తర నర్జునున కియ్య యత్నము సలుపఁగా నర్జునుం డుత్తర
తనకు శిష్యురాలు గాన దానిం బొందుట కిష్టపడక యాకన్నియను
దనకొడు కభిమన్యున కిచ్చి వివాహము గావించికొనుటయును, ద్రవ్య
శూన్యుఁడై స్వజనులు తన్ను విడువ సన్యాసిగ నుండినను ధర్మరాజునకు
యుద్ధకాలమున నేడక్షౌహిణులబలంబు సమకూడుటయును, భగ
వంతుఁడే యగు దేవకీపుత్త్రుండు వారి కెల్లకాలములయందుఁ దోడ్పడుట
కియ్యకొనుటయును, నారదుఁడు భగవదవతారరూపులగు నరనారా
యణులు కృష్ణార్జును లైరని పలుమాఱు నా కెఱింగించుటయును
శ్రీకృష్ణుండు పాండవులకును నావారికిని సంధి గావింప రాఁగా నాఁడా
సభలో నమ్మహాత్ముని గర్ణసుయోధనులు మున్నగు నావారు నిగ్రహింపఁ
దలఁచుటయును, సంధి కేతెంచి విదురునింటఁ గుడిచి మఱలి యేఁగుచుండు
వాసుదేవునిఁ గుంతి దీనురాలై వెంబడింప రథస్థుండైన యమ్మహా
త్ముండు రథము డిగ్గి యద్దేవిని సాంత్వవచనంబుల నూఱడించుట
యును, యుద్ధారంభకాలమునందు మంత్రియగు వాసుదేవుండును,
శాంతనవుం డగు భీష్ముండును, భారద్వాజుం డగు ద్రోణాచార్యుఁడును,
బాండవులను విజయు లగునట్లు దీవించుటయును, గర్ణుండు భీష్మునితోఁ
దగవు లాడి ‘నీ వని సేయుచుండ నే నద్దెసకు రా ననియు, నీవు

గెల్చినచో నేను వనవాసి నయ్యెద' ననియుఁ బంతమాడి భీష్ముఁడు యుద్ధ రంగంబున నుండునంతవఱ కనికి దొలంగి యుండుటయును, వాసు దేవార్జునులును నప్రమేయమగు గాండీవమును మూఁడుగ్రవీర్యములు గవిసియొక్కటగుటయును, నర్జునుం డుభయసేనలమధ్యమునకు రథంబును దోలి నిలుపునట్లు సారథి యగు వాసుదేవున కాజ్ఞాపింప నాతం డట్లో నర్పఁగా నాసమయమున నిరువాగులలో నుండుబంధుమిత్రులు రణరంగం బున నిహతు లయ్యెద రని శోక మోహములతో నర్జునుఁడు రణవిము ఖుఁడు కాఁగా, భగవంతుం డగు వాసుదేవుండు యోగమహిమచే విశ్వ రూపమును జూపి "జీవుండు నిత్యుండు, వానికిఁ జావు లేదు, వాఁ డచ్ఛేద్యుండు, అదాహ్యుండు, స్వయంప్రకాశుండు" అని గీతార్థంబుల నుపన్యసించి ప్రకృతి యెప్పుడైనను నశించునదే కావున శరీరమునకు నాశ మెప్పుడైనను గల్గు నని బోధించి యర్జునునిచే నొప్పించి యత నిని రణోన్ముఖుం గావించుటయును, శిఖండిని ముందిడికొని మహాశూ రుండును ననియం దోర్చుటకు వీలుకాని భీష్ముని నర్జునుఁడు గూలఁ ద్రోయఁగా నాతం డంపసెజ్జపైఁ బరుండుటయును, నర్జునుం డట్లు శర తల్పంబున శయనించియుండు తాతకుఁ దనధనుర్విద్యావిలాసంబు నేర్పున భూమిని బగులఁగొట్టి పాతాళగంగం గొనిదెచ్చి యాతని దాహం బుడుపుటయును, పాండుపుత్రులసైన్యమునందు శుభశకున ములయొక్కయు, మనవారి సైన్యమునం దపశకునములయొక్కయు సూచనలు గాన్పించుటయును, ద్రోణాచార్యుఁడు మహావ్యూహములను బన్నుచుఁ దనయస్త్రలాఘవమును జిత్రవిచిత్రముగాఁ బోరితమునందుఁ జూపుచుండినను వా రెవరును నాయస్త్రములచేఁ జావకుండుటయును, నర్జునుండు దనపై నొక్కపెట్టునఁ గలఁపడిన సంశప్తకుల నందఱ మహా రథుల హతులఁ జేయుటయును, బద్మవ్యూహము నభిమన్యుండు భేదించి లోనికిఁ జొచ్చి యనేకశూరులఁ బిచ్చలించున ట్లొనర్ప, వీరానీకం బంతయు నాతనిఁ జుట్టుముట్టి యాతని వధింపఁగా నిందులకుఁ గార కుండైన సైంధవునిపై నర్జునుం డలిగి యాతనిని మఱునాఁ డస్తమించు లోపుగఁ బొలియించునట్లు ప్రతిన పట్టి దానిని నెఱవేర్చుట కానాఁడు ఘోరయుద్ధము నొనర్చుచుండు నర్జునుని రథ్యంబులు

దయ్యుటయు వానినేద దీర్చుట కర్ణునుండు సేనాముఖ్యంబున నభేద్యంబైన యంపకోట నొక్కదానిని ననాథరథ్యంబులం గావించి సారథియైన శ్రీకృష్ణమూర్తి రథ్యంబుల నప్పుఁదీర్చి సేదపసంపఁగఁ దాను రథంబు డిగ్గి యొంటికాఁడై శత్రుసేనలపై విక్రమించి యద్భుతముం జేసి వెనుక రథము నెక్కునంతలో భీమసాత్యకులు దుర్యోధనుసైన్యంబును నోహటించి నిలిపి చెల్లాచెదరగునట్లు గొట్టుచుఁ దనరు పాఱఁదోలు చుండునవసరంబునఁ గర్ణుండు భీమసేనుం దలపడి యాతనితోఁ ఘోరస మరం బొనర్చి యాతఁ డేమరియుండఁ గర్ణుండు వాని నిరాయుధునిం జేసి క్రిందఁబడునట్లొనర్చి తనవింటికోపున భీమసేనుపొట్ట గ్రుచ్చినట్లుగను ట్లొత్తుచు నతనిని నవమానించి యుబ్బుచు నరుగుచుండఁ, దానును నితరులగు మనసైన్యములో నున్న శూరులను జూచుచుండఁగ నర్జు నుండు సైంధవుని తల నఱికి దానిఁ గ్రిందఁబడునట్లొనర్పక తనయస్త్ర మహిమ నేర్పునం జెండాడుచుఁ దనప్రతిజ్ఞ దీర్చుకొనుటయును, కర్ణుండు తన కింద్రప్రదత్తంబైన మహాశక్తినిఁ బ్రయోగించి యర్జునుని వధింపవలయును నని తలంపుఁ గొని యుండ నద్దానిని ఘటోత్కచునిపైఁ బ్రయో గించి వానిని జంపి వ్యర్థపఱుపవలసి వచ్చుటయును, సుభటసేనలలోని విలుకాండ్ర కెల్ల గురువగు ద్రోణాచార్యుండు నిజరథంబునఁ బ్రాయో పవిష్టుండై యుండఁగా నామహనీయుని ధృష్టద్యుమ్నుండు శిరోజములఁ బట్టికొని తల నఱుకుటయును, నశ్వత్థామ జగ మపాండవ మగునట్లు ప్రయోగించిన నారాయణాస్త్రంబునఁ బాండవులలో నొక్కండైనను జావకుండుటయును, భీమసేనుండు మనవారిలోఁ గలవారెల్లఁ జూచుచుండ దుశ్శాసనునితోఁ బోరి వానిఁ గ్రిందఁ బడఁ ద్రొబ్బి భీమంబుగా ఱొమ్ముఁ బగిల్చి వృకంబువిధమున వాని నెత్తురు త్రావుట యును, గర్ణుం డర్జునునితో మచ్చరించి తుదకు యుద్ధమున వానిచేఁ జచ్చుటయును, ధర్మజుండు విజృంభించి శల్యునిపై మహాశక్తి నొక్కదానిం బ్రయోగించి యద్దాన నామహనీయుని వధించుటయును దుర్ద్యూత మునకు మూలం బగు శకునిని సహదేవుండు దెగనేయుటయును, శత్రు లకు వెఱచి ద్వైపాయనహ్రదంబున జలస్తంభం బొనర్చి డాఁగియున్న

నాపుత్త్రు సుయోధనుని ధర్మజుండు పోటుమాటలాడి ప్రాసంబు వెడలఁదీసి భీమసేనునితో గదాయుద్ధమునకుఁ బురికొల్ప, శౌరిసన్నచే నధర్మంబున నాభిక్రిందఁ దొడలపై భీముఁడు గదచేఁ గొట్టఁగా నాపుత్త్రుండు దొడలు విఱిగి ప్రాణంబులఁ బోనాడుటయును, నాఁటిరాత్రి యశ్వత్థామ పాండవశిబిరముఁ జొచ్చి సుప్తులయిన పాంచాలుర నెల్లరను ద్రౌపదేయు లగునైదుగురను బొడిచి ఘోరమరణము నొందునట్లు చేయఁగా దానిని భీమసేనుం డెఱింగి యశ్వత్థామను బట్టికొనఁ బరువిడఁగా నందులకు గురుపుత్త్రుండు వెఱచి పాండవులపై నైషీకాస్త్రప్రయోగంబుఁ గావింప సవ్యసాచి దానిని బ్రహ్మశిరోనామకాస్త్రంబున నుపశమించున ట్లొనర్చి యశ్వత్థామ శిరోరత్నమును గొనుటయును, బాలఘాతుకుఁ డగు నశ్వత్థామను గేశవద్వైపాయనులు శపించుటయును, వాఁడు గ్రమ్మఱ వారిని శపించుటయును నివి యెల్లయును నేను వినుచుండునపు డెల్లను మనకు శుభంబు లొదవనేరవుగా యని దృఢమనస్కుఁడనై యుంటిని. గాంధారి తన నూర్గుఱు పుత్త్రులను, పౌత్త్రులను, భ్రాతలను, సమీపబంధువులను నీయుద్ధకారణంబునఁ గోల్పోయి దుఃఖసాగరంబును శరీరముండునందాక నీఁదవలసివచ్చెను. ఇట్టిదుష్కర మగు కార్యమును బాండవు లొనర్చి నిష్కంటకమైనరాజ్యమును బొందిరి. ఈమహాభయంకరమైన సంగ్రామమునందుఁ బదునెనిమిది యక్షౌహిణుల సైన్యమును మడిసినది. మొత్తమున కుభయులలోను బదిమంది బ్రతికియున్నవారు, మనసైనికులలో ముప్వురును, వారిలో నేడ్గురును మిగిలియున్నవారు దీని నంతయును దలపోయఁగా నాగుండెలు జల్లుమనును. మనస్సు కలఁత నొందును. బుద్ధి ఱెచ్చువడును. మొగంబు వెలవెలపాఱును. అని యనేకప్రకారంబులఁ బలవించి మూర్ఛిల్లి కొండొకసేపునకు సమాశ్వసిల్లి యాంబికేయుండు సంజయుం జీరి "సూతపుత్రా! నాప్రాణంబులు నిలువనోపవు. నేను జీవించుటలో ఫలమేమియుఁ గానరాకున్నది. పగలే తమోమయముగఁ గాన్పించుచున్నది యని నిట్టూర్పు పుచ్చుచు వేదనాభరంబు సహింపనోపకున్న నమ్మహీనాథునకు గావల్గణపుత్త్రుండగు సంజయుఁ డిట్లనియె. పూర్వము రాజవంశములలో మహోత్సాహపరులును, మహాశూరులును, గుణవంతులును, ముదితహృదయు

లును ననేకయాగముల నాచరించినవాఁడును నగు శైబ్యుఁడును, సృంజయుఁడు, సుహోత్రుఁడు, రంతిదేవుఁడు, మహాతేజస్వి యగు శ్రీవంతుఁడు, బాహ్లికుఁడు, దమనుఁడు, శర్యాతి, యజితుఁ డగు సగరుఁడు, శత్రుఘాతకుఁడగు విశ్వామిత్రుఁడు, పరాక్రమశాలియగు సంబరుఁడు, మరుత్తుఁడు, మనువు, ఇక్ష్వాకువు, గయుఁడు, భరతుఁడు, దాశరథి యగు శ్రీరాముఁడు, శశిబిందువు, భగీరథుఁడు, కార్తవీర్యుఁడు, మహాభోగుఁడు, జనమేజయుఁడు, మహారథుఁ డను పరాక్రమశాలియును, నెవనియజ్ఞములయందు దేవతలు స్వయముగా నేతెంచి స్వరూపధారులై హవిర్భాగములను గొనిపోవుచుండిరో, యట్టి యయాతియును నను నిరువది నలువురు మహారాజులీలోకమునందుఁ బెక్కుభోగముల ననుభవించి కాలవశమును బొంది రని మహర్షి యగు వేదవ్యాసుఁడును, దేవర్షి యగు నారదుఁడును జెప్పఁగా వినియున్నారము. ఎట్టివారికిని విధి యలంఘనీయము. ఇంకను ననేకులు పుత్రశోకార్తులై గాంచినవారు గలరు. వా రెల్లరు మహారథులు, మహాత్ములు, సుగుణసంపన్నులు. ఇట్టివా రనేకులు కాలగతిం దప్పించుకొన లేనివా రైరి. మహాగుణసంపన్నులైన వారును నిధనమును దప్పించుకొనలేరైరి. అట్టివారినే కాలపురుషుఁడు నమలి మ్రింగుచుండఁగా దురాత్ములును, దుష్టచారిత్రులును నగు నీపుత్రులు సత్పురుషులచే ఘోరరణనిహతు లగుటకు నీ వేల వగవవలయును? నీవు సకలవేదశాస్త్రములఁ జదివినవాఁడవు, మిక్కిలి ధీమంతుఁడవు. ప్రాజ్ఞసమ్మతుండవు. కాలగ్రస్తులై పరిత్యక్తమున సంభవించు దుఃఖమునకు నీయట్టిబుద్ధిమంతుఁడు వగవఁదగునే? ఎట్టి బుద్ధిమంతుఁడేని విధి చేయువుల నాపుకొనఁజాలఁడు. విధివిహితముకాని కజ్జ మేదియును లేదు. భావాభావములును సుఖాసుఖములును నగు నీసర్వమును గాలనిర్దిష్టము ప్రవర్తిలుచుండును. భూతోత్పత్తికిఁ గాలమే మూలము. తన్నాశమునకును గాలమే కారణము. ప్రజలను సంహరించు కాలునిసైతము కాలమే శమింపఁజేయును. సర్వలోకములయందును శుభాశుభభావములయుత్పత్తిని కాల మొనర్చును. కావున కాల మెప్పుడును దురతిక్రమము. సర్వభూతములయందును సమముగా వర్తించును. జరిగినవియు, జరుగుచుండునవియు, జరుగనున్నవియు నగు కార్యము లన్నియుఁ గాలవశము లని

బుద్ధిమంతుఁ డెఱింగి వెలుపు దక్కఁడయుండవలయును. ఇవ్విధముగా సంజయుండు పుత్రశోకముచే నడలుచున్న యాంబికేయుని సమాశ్వాసింపఁజేసె. ఈసంగతి నంతయు పుణ్యకథగాఁ గృష్ణద్వైపాయనుండు మహాభారతగ్రంథమున వచించెను. ఈభారతేతిహాసమునం దొక్కశ్లోకపాదమును జదివినను బుణ్యంబు సమకూరు నని పురాణములు చెప్పును. ప్రాతస్సాయంసమయములయందు భారతకథార్థ సంక్షేపరూపంబైన యీ యనుక్రమణిక నేపురుషుండు పఠించునో, వానికి మహాభారతేతిహాసగ్రంథము నంతను జదివినఫలము గల్గును. శ్రాద్ధకాలంబులయందు దీనిం పఠింపించినచో నాకర్మములు సుఫలముల నొసంగును. ఈమహాగ్రంథమును భక్తిశ్రద్ధలతో వినిన పుణ్యాత్ముండు పరలోక సుఖముల ననుభవించును. ఎల్లప్పుడును ధర్మాత్ముం డగును. పెరుగున నవనీత మెట్టిదియో, మనుష్యులలో బ్రాహ్మణునిచంద మెట్టిదో, వేదములలో నారణ్యకం బేరీతిదో, ఓషధులలో నమృతం బేపగిదిదో, జలాశయములలో సముద్ర మెట్లు శ్రేష్ఠమో, తిర్యగ్జంతువులలో గోవెట్లుత్తమమో యట్టు లితిహాసములలో నిమ్మహాభారత మత్యుత్తమమై వెలయును. పూర్వకాలమున దేవతలు నాల్గువేదములను దక్కెడయం దొకతట్టును, భారతమును వేఱొకతట్టును నుంచి తూఁచఁగా భారత ముంచినవైపుననే ముల్లు మొగ్గుచూపెను. అట్లు ఆమహత్త్వమును వేదార్థసారభారమును గల దగుట నీయితిహాసగ్రంథమును మహాభారతగ్రంథ మని పెద్దలు వక్కాణించిరి. కావున నీగ్రంథము మహాభారత మని ప్రఖ్యాతిఁ గాంచె. మహాభారతశబ్దార్థమును మాత్ర మెఱుంగువారు సర్వపాపవిముక్తు లయ్యెదరు. అని రోమహర్షణపుత్త్రుం డగు నుగ్రశ్రవసుం డను సూతనందనుండు శౌనకాదిమహామునులకుం జెప్పి వెండియు నిట్లనియె.

## భారతపర్వానుక్రమణిక

ఈ మహాభారతమున నాదిపర్వమునందు—పౌష్యము ౧, పౌలోమము ౨, ఆస్తీకము ౩, ఆదివంశావతారము ౪, సంభవపర్వము ౫, జతుగృహదాహము ౬, హైడింబము ౭, బకవధము ౮, చైత్రరథము ౯, స్వయంవరపర్వము ౧౦, వైవాహికము ౧౧, విదురాగమనము ౧౨,

రాజ్యలాభము ౧౩, అర్జునవనవాసము ౧౪, సుభద్రాహరణము ౧౫, హరణహారికము ౧౬, ఖాండవవనదహనము ౧౭, మయదర్శనపర్వము ౧౮ నను నవాంతరపర్వములు పదునెనిమిదిపర్వములు గలవు.

రెండవదియగు సభాపర్వమున—మంత్రపర్వము ౧, జరాసంధవధ పర్వము ౨, దిగ్విజయపర్వము ౩, రాజసూయము ౪, అర్ఘ్యాహరణము ౫, శిశుపాలవధ ౬, ద్యూతము ౭, అనుద్యూతము ౮ నను నవాంతర పర్వము లెనిమిది గలవు.

మూఁడవదియగు నారణ్యపర్వమున— కిమ్మీరవధ ౧, అర్జునాభిగమనము ౨, కైరాతము ౩, ఇంద్రలోకగమనము ౪, నలోపాఖ్యానము ౫, ధర్మరాజతీర్థయాత్ర ౬, జటాసురవధ ౭, యక్షయుద్ధము ౮, నివాతకవచవధ ౯, అజగరము ౧౦, మార్కండేయాగమనము ౧౧, సత్యాద్రౌపదీసంవాదము ౧౨, ఘోషయాత్ర ౧౩, మృగస్వప్నోద్భవ పర్వము ౧౪, వ్రీహిద్రౌణికము ౧౫, ఇంద్రద్యుమ్నపర్వము ౧౬, ద్రౌపదీహరణము ౧౭, జయద్రథవిమోక్షణము ౧౮, రామోపాఖ్యానము ౧౯, పతివ్రతామాహాత్మ్యము ౨౦, కుండలాహరణము ౨౧, ఆరణేయము ౨౨ నను నవాంతరపర్వము లిరువదిరెండు గలవు.

నాలవది యగు విరాటపర్వమున—పాండవప్రవేశపర్వము ౧, కీచకవధ ౨, గోగ్రహణము ౩, అభిమన్యువివాహము ౪ నను నవాంతరపర్వములు నాలుగు గలవు.

అయిదవది యగు నుద్యోగపర్వమున—ఉద్యోగము ౧, సంజయాగమనము ౨, ప్రజాగరము ౩, సానత్సుజాతము ౪, యానసంధి ౫, భగవద్యానము ౬, సేనానిర్యాణము ౭, ఉలూకదూతాభిగమనము ౮, రథాతిరథసంఖ్యానము ౯, అంబోపాఖ్యానము ౧౦ నను నవాంతరపర్వములు పదిపర్వములు గలవు.

ఆఱవదియగు భీష్మపర్వమున—జంబూఖండనిర్మాణము ౧, భూమిపర్వము ౨, భగవద్గీత ౩, భీష్మవధ ౪ అను నాలుగుపర్వములు గలవు.

ఏడవది యగు ద్రోణపర్వమున—ద్రోణాభిషేకపర్వము ౧, సాంశప్తకము ౨, అభిమన్యువధ ౩, ప్రతిజ్ఞాపర్వము ౪, జయద్రథవధ ౫, ఘటోత్కచవధ ౬, ద్రోణవధ ౭, నారాయణాస్త్రమోక్షపర్వము ౮ నను నవాంతరపర్వము లెనిమిది గలవు.

ఎనిమిదవది యగు కర్ణపర్వమున—కర్ణపర్వము ౧ యును గలదు.

తొమ్మిదవదియగు శల్యపర్వమున—హ్రదప్రవేశము ౧, గదాయుద్ధము ౨, సారస్వతము ౩, తీర్థవంశానుకీర్తనము ౪ నను నాల్గుపర్వములును గలవు.

పదియవదియగు సౌప్తికపర్వమున—సౌప్తికము ౧, ఐషీకము ౨ నను రెండుపర్వములు గలవు.

పదునొకండవది యగు స్త్రీపర్వమున—జలప్రదానము ౧, స్త్రీ విలాసపర్వము ౨, శ్రాద్ధపర్వము ౩ నను మూఁడుపర్వము లున్నవి.

పండ్రెండవది యది శాంతిపర్వమున—చార్వాకనిగ్రహము ౧, యుధిష్ఠిరపట్టాభిషేకము ౨, గృహవిభాగము ౩, రాజధర్మములు ౪, ఆపద్ధర్మములు ౫, మోక్షధర్మములు ౬ నను నాఱుపర్వములు గలవు.

పదమూఁడవదియగు ఆనుశాసనికమున—దానధర్మపర్వము ౧, భీష్మనిర్యాణము ౨ నను రెండుపర్వములు గలవు.

పదునాల్గవదియగు నశ్వమేధపర్వమున—అశ్వమేధారంభము ౧, అనుగీతలు ౨ నను రెండుపర్వములు గలవు.

పదునైదవదియగు నాశ్రమవాసపర్వమున—ఆశ్రమవాసము ౧, పుత్రదర్శనపర్వము౨,నారదాగమనము ౩ నను మూఁడుపర్వము లున్నవి.

పదునాఱవదియగు మౌసలపర్వమున—మౌసలము ౧ యును,

పదునేడవది యగు మహాప్రస్థానపర్వమున—నా పేరింటి పర్వము ౧ యును గలవు.

పదునెనిమిదియవది యగు స్వర్గారోహణ పర్వమున—నా పేరింటి పర్వము ౧ యును గలదు.

పిదప హరివంశంబు, విష్ణుపర్వము, భవిష్యత్పర్వము నను మూఁడు పర్వములతో నీమహాభారతము వెలయుచుండు. *

---

* శాంతిపర్వమున, ౧ చార్వాకనిగ్రహము, ౨ యుధిష్ఠిరపట్టాభిషేకము, ౩ గృహవిభాగము అను మూఁడుపర్వములను పర్వానుక్రమణికయందు వేఱుగాఁ జేర్చియున్నను, శాంతిపర్వము రాజధర్మపర్వముతో ప్రారంభింపఁబడుచున్నది. కావున హరివంశములోని పర్వములతోఁ జేరి యవాంతరపర్వములు నూఱే యగును. వానిని మినహాయించిన భారతమునందలి పర్వసంఖ్య ౯౭. ఇవ్విషయమున నాంధ్రమహాభారతమునకును సంస్కృతభారతమునకును భేద మగపడుచున్నది.

ఈమహాభారతేతిహాసము చతుర్విధపురుషార్థము లగు ధర్మార్థకామమోక్షములను నిరూపించుటం జేసి దీనిని ధర్మశాస్త్ర మని కొందఱును, నర్థశాస్త్రం బని యొక కొందఱును, కామశాస్త్ర మని మఱికొందఱును, మోక్షశాస్త్ర మని వేఱొకకొందఱును జెప్పుదురు. చతుర్వేదములను సాంగముగాఁ జదివియు నీయితిహాసమును జదువనిపురుషుండు విద్వాంసుండు గానేరఁడు. మనోహరము లైన కోకిలముల పంచమస్వరంబును విన్న వీనులకుఁ గాకులకఠినధ్వనులు రుచింపన ట్లిమ్మహేతిహాసంబును జదివినవానికి విన్నవానికి వేఱొకగ్రంథము రుచింపనేరదు. భూమి మున్నగు పంచమహాభూతములనుండి సర్వమును బుట్టినవిధంబున నీమహేతిహాసమును జదివిన కవిసమూహనకుఁ దెలివి తేటయై పలుతెఱంగులభావము లుద్భవించుచుండును. సర్వేంద్రియ వ్యాపారములకును మనోవ్యాపార మెట్లు లాశ్రయములో యవ్విధంబున సర్వకార్యగుణములకు నీయితిహాసములోని వృత్తాంతంబు లాశ్రయంబులై యుండును. ఆహారములేక శరీర మెట్లుండనేరదో యట్లే భారతమహాఖ్యానంబున కనుబంధింపని వృత్తాంతం బన్యం బుండనేరదు. శుభములను నభివృద్ధిని గోరు సుత్తమసేవకులు మేలైనదొర నాశ్రయించి జీవించుపగిదిఁ గవు లెల్లరు నీయితిహాసమునే తమకు నూతకట్టుగాఁ గొనియుందురు. శ్రీవేదవ్యాసునియధరములనుండి వెలువడిన తేనెధారలవంటి యీమహాభారతము నెవఁడు వినునో, వాఁడు సకలతీర్థములయందును గంగాదిపుణ్యనదులయందును బుణ్యకాలములలోను స్నానము చేసినఫలముకంటె నెక్కుడు ఫలము ననుభవించును. మనస్సుచేతను వాక్కుచేతను శరీరముచేతను రాత్రికాలములయం దొనర్చిన పాపములు పగటియందును, నట్లే పగటియందు నొనర్చిన పాపములు రాత్రియందును నిమ్మహాభారతమును బారాయణముఁ జేసినవారు నశింపఁజేసికొందురు. ఈ యితిహాసమును విను పుణ్యపురుషులకు బంగారుతొడవులతో నలంకరింపఁబడిన కొమ్ములుగల నూఱు గోవుల నుత్తమబ్రాహ్మణునకు దాన మొనర్చినవానిసుకృతము గలుగును. దాఁటుట కశక్యంబైన మహోదధిని నోడచే సుకరముగ దాఁటునట్లు, ఈ మహాభారతేతిహాససముద్రమును సర్వసంగ్రహ మను జ్ఞానబోధచే

సులభముగ దాఁట శక్యం బగు నని పౌరాణికుం డగు సూతుండు శౌన కాది మహామునివర్యులతోఁ జెప్ప వార లక్కథకున కి ట్లనిరి.

## శమంతకపంచకమున కాపేరు కలిగినవిధము, అక్షౌహిణీపరిమాణము

సూతుఁడా! శమంతకపంచకమునఁ బాండవులకును గౌరవులకును యుద్ధము జరిగె ననియు, నాయుద్ధమునందుఁ బదునెనిమిది యక్షౌహిణుల సైన్యము మ్రందె ననియుఁ జెప్పియుంటివి. యుద్ధము జరిగిన యాప్రదేశమునకు శమంతకపంచక మనుపే రేల గలిగె? అక్షౌహిణికిఁ బరిమాణ మెయ్యది? వివరింపవే యని యడుగుటయు నందుల కా సూతుం డి ట్లనియె.

పూర్వకాలమునఁ ద్రేతాద్వాపరయుగముల సంధియందు రాజులు మదించి ధర్మమార్గముఁ దప్పి దుష్టులై వర్తించుచుండి, విష్ణువంశమునఁ బుట్టినపరశురాముఁ డిరువదియొక్కమాఱులు వెదకి వెదకి వారిని దునుమాడి వారినెత్తుట నైదుమడుంగు లొనర్చి యామడుగులందుఁ బితృదేవతలకుఁ దుష్టిగాఁ దర్పణం బొనర్చెను. అంత, ఋచీకాదు లగు పితరులు పరశురామునికార్యముచే సంతుష్టులై యారామునియొద్దకు వచ్చి 'నీపితృభక్తికి సంతసించితిమి. వరం బడుగుము.' అనిరి. అంత వారితోఁ బరశురాముండు తనకు బహుక్షత్రియవధంబునఁ బ్రాప్తించిన పాతకంబు తన్నుఁ జెందకుండునట్లును, నానెత్తుటిమడుగు లైదును బుణ్యతీర్థము లగునట్లును బ్రసాదింప వేఁడెను. అంత నాపితరులు పరశురామునకు వరముల నిచ్చి యదృశ్యులైరి. అదిమొదలుకొని యామడువులు పరమపవిత్రము లయ్యెను. ఆమడువులకు సమీపమునం దున్న దేశమంతయును శమంతకపంచక మని ప్రఖ్యాతిఁ జెందె నని చెప్పి యక్షౌహిణీపరిమాణంబును నిట్లని చెప్పందొడంగె.

రథమొక్కటి, గజమొక్కటి, గుఱ్ఱములు మూఁడు, కాలుబంటులేవురుఁ గలుగఁ బత్తి యనఁబడును. దాని మూఁడింతలు సేనాముఖ మనఁబడు. అట్టిది మూఁడైన నొక్క గుల్మ మగును. ఆగుల్మత్రయ మొక్క గణము. మూఁడుగణము లొక్క వాహిని. దానిమూఁడింత లొక్క పృతన. పృతనలు మూఁ డొకచము వగు. ఆచమువులు మూఁడగుచో నొక యనీకిని యగును. అట్టి యనీకినిపదిశక మొకయక్షౌహిణి యగును. ఇట్లు

లెక్కచేయఁగా ! నిరువదియొక్కవేలు నెనమన్నూట డెబ్బదిరథంబులు, నన్ని యేనుంగులు, నలువదియైదువేలు నాలునూట పదిగుఱ్ఱంబులు, లక్షయుం దొమ్మిదివేల మున్నూట యేబండ్రు వీరభటులును గల యది యొకయక్షౌహిణి యని చెప్పఁదగు.

## అక్షౌహిణీసంఖ్య

| సేనల పేర్లు. | తేరులు. | ఏనుఁగులు. | గుఱ్ఱములు. | కాలిబంట్లు. | మొత్తము. |
|---|---|---|---|---|---|
| పత్తి | ౧ | ౧ | ౩ | ౫ | ౧౦ |
| సేనాముఖము | ౩ | ౩ | ౯ | ౧౫ | ౩౦ |
| గుల్మము | ౯ | ౯ | ౨౭ | ౪౫ | ౯౦ |
| గణము | ౨౭ | ౨౭ | ౮౧ | ౧౩౫ | ౨౭౦ |
| వాహిని | ౮౧ | ౮౧ | ౨౪౩ | ౪౦౫ | ౮౧౦ |
| పృతన | ౨౪౩ | ౨౪౩ | ౭౨౯ | ౧౨౧౫ | ౨౪౩౦ |
| చమువు | ౭౨౯ | ౭౨౯ | ౨౧౮౭ | ౩౬౪౫ | ౭౨౯౦ |
| అనీకిని | ౨౧౮౭ | ౨౧౮౭ | ౬౫౬౧ | ౧౦౯౩౫ | ౨౧౮౭౦ |
| అక్షౌహిణి | ౨౧౮౭౦ | ౨౧౮౭౦ | ౬౫౬౧౦ | ౧౦౯౩౫౦ | ౨౧౮౭౦౦ |

ఇట్టి యక్షౌహిణు లేడింటిని గుంతీపుత్త్రులును, బదునొకండింటిని గాంధారీతనయులును నిరువాగులవారును గలసి పదునెనిమిదింటిని జేర్చి కొని యాశమంతకపంచకమున ఘోరయుద్ధమును జేసిరి. ఆయుద్ధమున గాంధారీసూనుల సైన్యాధిపతియై కురుపితామహుండగు భీష్ముండును పది దినములు కుంతీసూనుల సైన్యముతోడ యుద్ధము చేసెను. పిదప ద్రోణా చార్యుండు కౌరవసేనానాయకుండై యైదునాళ్లు రణమొనర్చెను. పిదప పడి కర్ణుండు రెండుదినములును, శల్యుండు దినమునందుఁ బగటిపూట సగంబును, రణంబుసేసి మడిసినపిదప దుర్యోధనుండు మిగత సగము పగటియందు భీమునితో గదాయుద్ధముచేసి కాలుపురికిఁ బోయెను. ఈ శమంతకపంచక మను ప్రదేశమునఁ గౌరవులు యుద్ధము చేసిరి గావున నీప్రదేశము కురుక్షేత్రంబు నాఁ బరఁగె.

అట్టికురుక్షేత్రంబునఁ బారిక్షితుం డగుజనమేజయుండు తనతమ్ములు ముప్వురగు శ్రుతసేనోగ్రసేనభీమసేనులును సాయపడఁగా దీర్ఘసత్రము నాచరించె. అప్పు డచ్చోటికి దేవశుని యగుసరమకొడుకు సారమేయము క్రీడార్థ మరిగి యిటునటు దిరుగుచుండ జనమేజయుని తమ్ములు ముప్వురును దానిం గొట్టిరి. అది యఱచుచుఁ దనతల్లి సరమయొద్ద కేఁగి రాజుతమ్ములు దన్నుఁ గొట్టి రని యేడ్చెను. అంత సరమ కొడు కును 'నీవు వారి కేదైన నెగ్గుఁ గావించితివా' యని యడుగఁగా సార మేయము దాను నిరపరాధి యనియుఁ, దా నాయజ్ఞవాటమున నూరక తిరుగుచుంటి ననియుఁ జెప్పె. అంత సరమ జనమేజయభూపాలుని కడ కేఁగి యి ట్లనియె. "భూపాగ్రణీ! చూడుము. నాకొడుకు నీయజ్ఞ వాటమునఁ దిరుగుచుండ నీతమ్ములు వానిం గొట్టిరి. కావున లోకమున దుర్వినీతులు సాధులకును, బేదవానికిని తగు నిది తగ దిది యని విచారింపక యెగ్గులు గావించుట సర్వసామాన్యము. అట్టివారికి ననిమిత్తాగమము లగుభయములు గలుగును" అని చెప్పి నాకలోక మున కరిగె. అంత రాజు సత్రయాగమును బరిసమాప్తిఁ గావించి హస్తినాపురిం బ్రవేశించి సరమశాపమునకుఁ బ్రతీకారంబుగ శాంతిక పౌష్టిక కర్మముల నొనర్చుట కుద్దేశించి తగునాచార్యుం డెవండో యని విచారించుండె. అ ట్లుండ నొకనాఁడు వేఁటనిమిత్త మరణ్యము సొచ్చి పోవువాఁ డచ్చట నొకపుణ్యాశ్రమంబుఁ గని యది శ్రుతశ్రవుం డనుఋషివర్యునిదిగా నెఱింగి యామునిచెంత కేఁగి నమస్కరించి యిట్లనియె. తపోధనా! నీపుత్త్రుం డగు సోమశ్రవసుండు నా కాచా ర్యుండై యుండ ననుగ్రహింపు మని వేఁడెను. అంత నాశ్రుతశ్రవుం డిట్లనియె. రాజాగ్రణీ! ఈ నాపుత్త్రుం డగుసోమశ్రవసుండు నావీర్య మును ద్రావిన యొక నాగకన్యకకుఁ బుట్టినవాఁడు. చెఱుపుల నెల్ల శమిం పఁజేయ సమర్థుండు. మఱియు నెవ్వండేని విప్రుండు తన్ను దేని నడిగినను నిచ్చువాఁడై ప్రతిజ్ఞఁ బూనియున్నవాఁడు. ఈనియమము నకు లోపము వాటిల్లక జరుపుదువేని, నాసుతుని నీ కాచార్యునిగాఁ గొనిపోవు కాటంక ముండ నేరదు. అనఁగా నాఋషివర్యునకు నృపా లుం డి ట్లనియె. మునివర్యా! మీ రానతిచ్చినతీరున నడిపెద నని

సోమశ్రవసునిం బురోహితుంగా హస్తిపురికిం గొంపోయి యాతని యాత్విజ్యమున ననేకయజ్ఞములను గావించుచుండె. ఇట్లుండ జనమేజయుండు తక్షశిలాదేశమునకు దండువెడలి యాదేశమును గెలిచి హస్తిపురమునకు మఱలి యేతెంచి స్వస్థచిత్తుండై యుండ నొక్కనాం డాతని పాలికి నుదంకుం డనుమహర్షి యేతెంచెను. ఆతనిచరిత్రమును నుడివెద. సావధానులరై వినుం డని కులపతి యగుశౌనకుం దొట్టిన మునివర్యులకు సూతుం డి ట్లనియె.

## ధౌమ్యుం డనుఋషి తనశిష్యులభక్తిం బరీక్షించుట

పూర్వకాలమున ధౌమ్యుం డను తపస్సంపన్నుం డయోదంతముల వాండు తనకు ఆరుణి, ఉపమన్యుండు, వేదుండు నను ముగ్వురు శిష్యులు సకలోపచారములు సేయుచుండ వారలతో నొక యరణ్యంబున నాశ్రమ మేర్పఱచుకొని మెలంగుచుండెను. ఆమహర్షి యొక్కనాం డారుణిం బిలిచి యి ట్లనియె. అయ్యా! నీవు కేదార క్షేత్రంబునకుం బొమ్ము. అచ్చట నీళ్లు నిలుచునట్లు కట్ట నొకటిం గట్టి నీళ్లను నులుపు మనంగా నాతండు గురునాజ్ఞ శిరసావహించి యచ్చోటి కేగి యెన్నిమారులు కట్ట కట్టినను నీటివేగంబున నాకట్టలు తెగిపోవుచు నీరు నిలువక ప్రవాహముగం బోవుచుండం, గొంతసేపటి కారుణి యాలోచించి తాన నీటి ప్రవాహమున కడ్డముగం బరుండె. అంత నాయుదకంబు లారుణి గురుభక్తికి మెచ్చి తా.మా సేతువుచే బంధింపంబడి వానిగురుభక్తిమాహాత్మ్య ఫలముగ నిలిచియుండె. ఇట్లుండ నొక్కనాండు ధౌమ్యుండు 'సేతుబంధనంబున కని కేదారఖండంబునకుం బోయిన యారుణి యెన్నాళ్లకును రాండయ్యె. మన మెల్లరము పోయి వానిపోకడ గుర్తించి వత్త' మని మిగిలిన శిష్యులతోం గేదారఖండంబునకుం బోయి 'ఆరుణీ' యని పిలువ నారుణి "ఇదె యరుదెంచుచున్నాండ" నని వెంటనే లేచి వచ్చి గురునకు నమస్కరించి పాదసూపెను. అంత నాగురువర్యుం డారుణితో నిట్లనెను. ఆరుణీ! నీవేల యిన్నాళ్లిచ్చోట మసలితివి? అని యడుగ నయ్యారుణి "గురువర్యా! ఎన్నియుపాయములను బన్నినను నీయుదకంబు

లాగవయ్యె. కావున నీసలిలంబున కడ్డంబుగా నేన పరుండి యుంటి. అంత నది బంధమునకు లోఁబడినది" అని చెప్పి "ఇంకను నాజ్ఞ యేమి" యని ప్రార్థింపఁగా, ధౌమ్యుండు వాని కిట్లనియె. "శిష్యవరా! నీగురుభక్తికి మెచ్చితి." నీవు కేదారఖండముఁ బెకలించితివి గాన "నుద్దాలకుండను నామముతో వెలయుము. సకలవిద్యలును దమంత మనమున నీకుఁ దోఁచుఁగాత!" అని చెప్పి వాని కాజ్ఞ యొసంగి వాని యిచ్చమైఁ జరింపనంపెను. అంత నయ్యారుణి గురునియనుగ్రహంబును దనకు మహాప్రసాదంబునఁ గొని శుభములు నొందుచు నిష్టానుసారముగ వర్తించుచుండె.

పదంపడి ధౌమ్యుం డొకనాఁ డుపమన్యుఁ డను శిష్యుం బిలిచి తమయావుల మేపుటకుఁ బొమ్మనెను. గురునియాజ్ఞ నుపమన్యుండు దలందాల్చి నిత్యము వేకువను లేచి యావులం దోలుకొని యరణ్యంబునఁ బచ్చికగల తావులయందు లెస్సగ మేపుచు, ననుదినము సాయంకాలమునకు నావులం దోలుకొని యాశ్రమమున కేతెంచి గట్టుచు వర్తించెను. అంత నొక్కనాఁడు ధౌమ్యుం డుపమన్యుం జీరి యిట్లనియె. "అయ్యా! నీవనుదినమును వఱువాత లేచి పశువులఁ దోడ్కొని సాయంకాలమునకు మఱలి యాశ్రమమునకు వచ్చుచున్నాఁడవు. ఆహార మెట్లు నీకు? నీవు ఎప్పటియట్ల ధృఢకాయుఁడవై డయ్యకయున్నవాఁడవు. ఇందులకుఁ గతం బేమి?" యని యడిగెను. అంత శిష్యుండగు నాయుపమన్యుం డిట్లనియె. "గురువర్యా! మధ్యాహ్నంబున కాశ్రమంబునకు వచ్చి భిక్షం గొని భిక్షాన్నంబును భుజించుచున్నవాఁడ" ననియె. అంత గురుండు 'ఇంక నీవు దెచ్చుభైక్ష్యమును మాయనుమతి లేక యారగింపకుము' అనఁగా మఱునాఁ డెప్పటియట్లు గోవులఁ దోలుకొని వనంబునకుఁ బోయి సాయంకాలమున కాశ్రమంబున కేతెంచి యావుల నన్నింటిని గోశాలలోఁ గట్టివైచి భైక్ష్యముం దెచ్చి గురుసన్నిధియందుంచి దూరమున నిలుచుండియుండ నుపమన్యుం జూచి గురుండు భిక్షాన్నంబు నంతయు నే నుపయోగించెద ననఁగా, శిష్యుండు వల్లె యని పోయెను. ఇట్లు కొన్నాళ్లుజరిగెను. అంత నొక్కనాఁడు గురుండు శిష్యుం జూచి నీవు దెచ్చుచుండు భైక్ష్యమును నే నుపయోగించుచుండినను, నీ వాహారంబు లేకుండినను జక్కని బలముగలవాఁడవై యున్నాఁడవు.

దీనికిఁ గారణం బేమి? యని యడుగ శిష్యుం డిట్లనియె. గురువర్యా! నేను దొలుతఁ దెచ్చినభైక్ష్యమును మీ కొసంగుదు. పిదప భైక్ష్యాచరణనిమిత్తము రెండవసారి యేఁగుదును. అపుడు తెచ్చినభైక్ష్యమును నే నారగింతును. కావున నలయను, డయ్యను అని విన్నవింపఁగా నీవిట్లు రెండుపర్యాయములు భైక్ష్యమునకుఁ బోయి భిక్షను గొని తెచ్చుట యాశ్రమంబునుండి భిక్షకేఁగునితరుల కాటంక మగును. కావున నీవు రెండవసారి భిక్షకుఁ బోకుము. అని గురువు సెప్పఁగా నుపమన్యుండు వల్లె యని యథారీతి నావుల మేప ననుదినము వఱువాత లేచి పోవుచు, సాయంకాలమున నాశ్రమమునకు వచ్చుచుండెను. అంత నొక్కనాఁడు గురువు శిష్యుం జూచి 'ఉపమన్యూ! నీవు భిక్షను దెచ్చి యారగించుట లేదు. నీవు తెచ్చు భైక్ష్య మంతయు నా కొసంగుచున్నాఁడవు. మఱియు నాహార మేదియుఁ గొనకుండినను నీ వెట్లు బలిష్ఠుండవై కానఁబడియెదవు? వివరింపవే!' యని యడుగ గురువునకు శిష్యుం డిట్లనియె. 'ఓగురుఁడా! వినుము. మధ్యాహ్నకాలమున నావుల మేపునపుడు వానిక్షీరమును బితికి త్రాగుచుందును. ఆకారణమున బల్లిదుండనై యున్నవాఁడ' ననియె. అంత గురుండు "దూడల కుపయుక్తమైన క్షీరమును నీవు త్రావినచో నవి చిక్కిపోవును. వానినోటికూటి కడ్డంబు పోఁ దగదు. కావున నింక నీ వాక్షీరము నుపయోగించుకొనకుము" అని యాదేశించెను. శిష్యుం డాగురువు నాజ్ఞను శిరసావహించి మునుపటివలెనే తనకార్యమును నిర్వర్తించుచుండె. అంత మఱియును గొన్నినాళ్లకు నుపమన్యుని ధౌమ్యుండు సూచి యిట్లనియె. ఉపమన్యూ! నీవు దెచ్చు భిక్షాన్నమును మా కొసంగుదువు. రెండవసారి భైక్ష్యముం గొనవు. ఆవులను మేపునప్పుడు వానిపాలను బితికి త్రాగవు. అట్లైనను సేవించుకేని చిక్కక బలియుఁడవై యుండుటకుఁ గారణం బేమని మఱల నడిగెను. అప్పు డుపమన్యుం డిట్లనియె. 'ఆచార్యవర్యా! అనుదినము దూడలు తమతల్లులైన యావులు మేయుచుండఁగాఁ బాలు గుడుచుచుండును. ఆసమయమున వానినోటినుండి నురుగు వాతోద్ధూతమగును. ఆఫేనమును త్రావి బల్లిదుండనై యున్నాఁడ' ననిపలికెను. అంత

గురుండు 'ఫేనము నింకఁ ద్రావకు' మనెను. శిష్యుండును వల్లె యని తరువాత నెప్పటియట్ల పసులం దోలుకొని మేపుట కేఁగును. ఇట్లుపమన్యుండు గురూపదిష్టమార్గంబుచొప్పునఁ దొలుతఁ దెచ్చిన భిక్షాన్నంబును గురువున కాహారముగ నొసంగును. రెండవసారి భైక్ష్యమునకుఁ బోఁడు. ఆవులమేపుటకుఁ బోయినతఱి వానిపాలను బిదికి త్రాగకుండును. మఱియు దూడలు కుడుచుచుండగా వానినోటఁ గట్టునురుగు వాతోద్ధూతమైనను దానిం ద్రావకుండును. ఇట్లతఁ డన్నివిధంబుల నాహారంబు గొనుటకు వీలులేక యాజ్ఞాబద్ధుండై చరించుచుండ నొక్కనాఁ డాఁకలి కోర్వలేక వనమునం దున్న పండినజిల్లేడాకులఁ దినుటంజేసి కన్నులు రెండును బోయి యంధుం డయ్యెను. అట్లావనంబునఁ గన్నులుగానక తిరుగాడుచు నతఁ డొకబావిలోఁ బడియెను. సూర్యాస్తమయ మయ్యెను. ఆవులు మాత్ర మాశ్రమంబు నేరెను. ఉపమన్యుం డాశ్రమంబునకు రాత్రి యెంతకాలమునకును రాఁ డయ్యెను. అంత నుపాధ్యాయుండు గొంతసేపు వానిరామికిం జింతిలి యాయపరాత్రము వనంబునకుఁబోయి వానిని నలుదెసల నెమకుచు నొకచో నుపమన్యూ! యని పేరితోఁ బిలువఁగా బావిలో నున్న వాఁ 'డోయాచార్యవర్యా! నే నంధుండనైతి. ఆకారణంబున నీయడవిలోనుండి యాశ్రమంబునకు దారి తెలియక తడవుకొనుచు వచ్చుచుండ దారియందున్న యీబావిలోఁ బడితి. త్రోవ లేక ప్రాణములతో నిం దున్నవాఁడ' నని శిష్యుండు గురువునకుఁ దన వృత్తాంతంబు నంతయు నెఱింగింప, గురుండు కొంతప్రొద్దాలోచించి వానిస్థితికిఁ బశ్చాత్తాపపడి యిట్లనియె. 'ఉపమన్యూ! దేవతలవైద్యు లగు నశ్వినీదేవతల నుతింపుము. వారియనుగ్రహమున నీకన్నులు తెలియఁగల' వనఁగా నుపమన్యుండు వారి నిట్లు స్తుతించె.

ఋచః—ప్రపూర్వగౌ పూర్వజౌ చిత్రభానూ
గిరా వాశంసామి తపసా హ్యనంతౌ,
దివ్యౌ సుపర్ణౌ విరజౌ విమానా
వధిక్షిపంతౌ భువనాని విశ్వా. ౧
హిరణ్మయౌ శకునీ సాంపరాయౌ
నాసత్యదస్రౌ సునసౌ వైజయంతౌ,

శుక్లం వయంతౌ తరసా సువేమా
వభివ్యయంతౌ వసితం వివస్వతః. ౨
గ్రస్తాం సుపర్ణస్య బలేన వర్తికా
మముంచతామశ్వినౌ సౌభగాయ,
తావత్సువృత్తా వనమం తమాయయా
వసత్తమాగా అరుణా ఉదావహత్. ౩

షష్టిశ్చ గావ స్త్రిశతాశ్చ ధేనవ
ఏకం వత్సం సువతే తం దుహంతి
నానాగోష్ఠా విహితా ఏకదోహనా
స్తా వశ్వినౌ దుహతో ధర్మ్యముక్థమ్. ౪
ఏకాం నాభిం సప్తశతా అరా శ్శ్రితాః
ప్రధిష్వన్యా వింశతి రర్పితా అరాః,
అనేమిచక్రం పరివర్తతే౽జరం
మాయా౽శ్వినౌ సమనక్తి చర్షణీ. ౫
ఏకం చక్రం వర్తతే ద్వాదశారం
షణ్ణాభిమేకాక్షమమృతస్య ధారణమ్,
యస్మిన్ దేవా అధి విశ్వే విషక్తా
స్తా వశ్వినౌ ముంచతో మా విషీదతమ్. ౬

అశ్వినా విందు మమృతం వృత్తభూయౌ
తిరోధత్తా మశ్వినౌ దాసపత్నీ,
హిత్వా గిరిమశ్వినౌ గాముదాచరంతౌ
తద్వృష్టిమహ్నా ప్రస్థితౌ బలస్య. ౭
యువాం దిశో జనయథో దశాగ్రే
సమానం మూర్ధ్ని రథయాతం వియంతి
తాసాం యాత మృషయో౽నుప్రయాంతి
దేవా మనుష్యాః క్షితి మాచరంతి. ౮

యువాం వర్ణాన్ వికురుథో విశ్వరూపాం
స్తే౽ధిక్షిపంతే భువనాని విశ్వా,

తే భాసవో౽ప్యనుస్మృతా శ్చరంతి
దేవా మనుష్యాః క్షితి మాచరంతి.
తౌ నాసత్యా వశ్వినౌ వాం మహే౽హం
స్రజం చ యాం బిభృథః పుష్కరస్య
తౌ నాసత్యా వమృతా వృతా వృధా
వృతే దేవా స్తత్ప్రపదే న సూతే. ౧౦
ముఖేన గర్భం లభ తాం యువానౌ
గతాసు రేతత్ప్రపదేవ సూతే,
సద్యోజాతో మాతర మత్తి గర్భ
స్తావశ్వినౌ ముంచథో జీవసే గాః. ౧౧

ఇట్టి మహామహిమయు విశేషార్థములు గల ఋఙ్మంత్రములతో నశ్వినీదేవతలు స్తుతింపఁబడి యుపమన్యునకుఁ బ్రత్యక్షమై వానిఁ కొక్క యతిరసము నిచ్చి దానిని భక్షించినచో నేత్రములకు దృష్టి వచ్చు ననిరి. అంత నుపమన్యుండు తాను గురువునాజ్ఞ లేనిదే యాయపూపభక్షణ మును గావింప ననియె. అందుల కాదేవతలెజ్జులు "నీగురునకును మే మిట్లే వేఱొకయప్పమును దెచ్చియున్నాము. దానిని వారి కొసం గుము. ఈయప్పమును నీవు దినుము" అనిరి. ఉపమన్యుఁడు "దేవత లారా! నాకు గురువు తనయాజ్ఞ లేనిదే దేనిని భక్షింపఁగూడ దని కట్టడ యిడియె. కావున నాతనియాజ్ఞ కానిదే మీయపూపము తినుటవలన నానేత్రములకు పోయినదృష్టి వచ్చునదైనను నేను భక్షింపను" అని చెప్పెను.అంత నాయశ్వినీదేవతలు"నీగురువు మున్ను మాకనుమతించుటం జేసి వారి కొకయపూపము నొసంగితిమి. ఆయపూపమును నీగురు విడి వఱకు భక్షించెను. కావున నీవు దీని నుపయోగింపఁ దగును" అని పలు తెఱంగుల నుడివిరి. ఇట్లెన్నివిధంబులఁ జెప్పినను తన గురునాజ్ఞ లేనిది తా నెద్దానిని భక్షింప నేర నని యుపమన్యుండు కంఠోక్తిగా నిర్ణయించి చెప్ప నాదేవత లుపమన్యునిగురుభక్తికి మెచ్చి వానితో నిట్లనిరి. ఉప మన్యూ! నీ కుండుగురుభక్తి మాకు వింతఁ గలిగించుచున్నది. నీకు మేము ప్రసన్నుల మైతిమి. నీగురువున కుండు నయోమయనీలదంతము

లిఁక బంగారుదంతము లగును. నీనేత్రములకుఁ బోయినదృష్టి మరల తక్షణము వచ్చును. నీ వెల్లశుభములను బడయుదువు. అని చెప్పుచుండఁగనే యుపమన్యుండు లబ్ధదృష్టి యై బావియం దుండి లేచి గురునాశ్రమంబునకుఁ బోయి గురునకు మ్రొక్కి యశ్వినీదేవతలు దనకుఁ బ్రత్యక్షంబైన వృత్తాంతంబంతయును సవిస్తరంబుగా విన్నవించెను. అంత నాధౌమ్యుండుపమన్యునివిధేయతకు తనయాజ్ఞనుల్లంఘింపమికిఁ గరంబు సంతసిల్లి యుపమన్యునకు సకలవేదంబులు వేదాంగములతోను, సర్వశాస్త్రంబులును దానియర్థములతోను దోఁచున ట్లనుగ్రహించి వానికి సర్వశ్రేయములు సమకూఱున ట్లాశీర్వదించి యెచ్చటనైనఁ దగు కన్యకను వరించి వివాహముఁ జేసికొని గృహస్థాశ్రమమును స్వీకరింప నానతిచ్చి యనిచె.

పిదప నాధౌమ్యఋషివర్యుఁడు తనశిష్యులలో వేదుం డనునొక్కని నొక్కనాఁడు చీరి యిట్లనియె. ఓశిష్యుఁడా ! ఇఁకను నీవు మా యింటఁ గలసకలకార్యములను జాగరూకుండవై నిర్వహించుచుండుము. అనఁగా నాతండును సకలకార్యనిర్వహణమునందు నప్రమత్తుండై దేనికి విసుగుచెందక మెలఁగుచుండె. అంత నాచార్యుండు వేదుఁ డింధనములకుఁ గాననముల కేగి నిత్యము నోపికతో వానిని దెచ్చుచు, బరువుల మోయుచు, నావుల మేపుచు, ననుదినము సాయంకాలమ్మున నాశ్రమమునకు వానితో నేతెంచి వానిని గోశాలలోఁ బదిలముగాఁ గట్టుచు, నగ్నినిఁ బ్రణయించుచు, నిష్టికాలములయం దాచార్యునకుఁ దోడ్పడుచుండుటం గని యాచార్యుండు వానిశుశ్రూషకు మెచ్చి వేదునకు సర్వశోభనంబులును సర్వజ్ఞత్వమును బ్రసాదించి బ్రహ్మచర్యమును వీఁడుటకును, గృహస్థాశ్రమస్వీకారమును గావించుటకును ననుజ్ఞ యొసంగెను.

## ఉదంకోపాఖ్యానము

అంత వేదుండును ధౌమ్యాశ్రమంబును వీఁడి కొండొకచోఁ దన కనుకూలయైన కన్యను వివాహమాడి యాభార్యతో నొక్కవనంబున నాశ్రమం బేర్పఱచుకొని శిష్యులఁ బరిగ్రహించి, తాను తన గురునియాశ్రమంబునఁ జేయుచుండినకార్యకష్టములం దలపోయుచు దనశిష్యుల కేకార్యములను జెప్పక వారిచే వేదములను శాస్త్రములను

బఱింపించుచుండె. అట్లుండ నొక్కనాఁడు పౌష్యజనమేజయులు వేదుని యాశ్రమంబున కేతెంచి వా రొనర్పఁగల యజ్ఞంబునకు వేదుని ఋత్విక్కునిగా వరించిరి. అందులకు వేదాచార్యుం డియ్యకొని యజ్ఞము నకుఁ బోవువాఁడై తనశిష్యులలో నుదంకుఁ డనువానిం బిలిచి యిట్లనియె. "శిష్యా! నేను జగమ్మునకు ఋత్విక్కుఁడుగా వరింపఁబడి పోవుచున్నవాఁడ. నేను యాగము పూర్తియై వచ్చుదనుక నాయాశ్రమమందెద్దానికిని హాని రానీయక యప్రమత్తుండవై మెలంగవలయు" నని యాజ్ఞ నొసంగి యాగోపకరణంబులం గొని యేఁగెను. అంత నుదంకుం డుపాధ్యాయునియానతి మెయి మెలంగుచుండ వేదునిభార్య ఋతుమతి యయ్యె, అప్పు డాశ్రమవాసు లగుస్త్రీలంపలు నుదంకునిం జేరి యిట్లనిరి. ఓయీ శిష్యవరా! నీగురువు నిన్నాశ్రమంబున నెద్దానికి హాని వాటిల్లక యప్రమత్తుండవై మెలఁగుట కనుజ్ఞ నొసంగియున్నవాఁడు. ఇప్పుడు నీగురుభార్యకు ఋతుకాల మతిక్రమింప నీయక గర్భాదానంబు సేయుము. అనఁగా నుదంకుండు స్త్రీలమాటలయం దాదరంబు సేయక వారు సెప్పిన ట్లొనర్పక యూరకుండి గురునిరాక కెదురుచూచుచు గురునియింట జాగరూకుఁడై వర్తిల్లుచుండె. ఇట్లుండ వేదుండు యాగము పూర్తి గావించి పౌష్యజనమేజయులయనుమతిం గొని నిజాశ్రమమునకుం జేరి సకలవృత్తాంతంబులను నెఱింగి శిష్యుం బిలిచి యిట్లనియె. ఉదంకా! నీగురుభక్తికి మెచ్చితి. నీవు సర్వమనోరథములను బడయుము. ఇఁక బ్రహ్మచర్యము చాలును. తగుకన్యక నన్వేషించి వివాహమై గృహస్థాశ్రమధర్మములఁ జరింపుము. అనఁగా నయ్యుదంకుం డయ్యా! గురుదక్షిణ నొసంగఁ బ్రీతియై యున్నది. ఎయ్యది యొసంగు వాఁడ. ఆనతీయవే యని గురువుఁ బలుమాఱుతలు నిర్బంధించి పలుక, నాగురుండు తనపత్ని కిష్టమైనవిధము నాచరింపు మనెను. అంత నుదంకుఁడు గురుపత్నిని సమీపించి యిట్లనియె. దేవీ! నేను గురుదక్షిణ సమర్పింప వేడుకతో నున్నవాఁడ. గురువునానతిం గొని యభీష్టము నిన్నడుగ నేతెంచితి. నీ వెద్దానిఁ గోరుదువ దానిఁ దెచ్చి సమర్పింప సిద్ధుండను. నాయందుఁ గరుణించి యభీష్టముసు దెలుపు మనఁగా నా దేవి యానాఁటికి నాలవనాఁడు తాను పుణ్యకం బను వ్రతము నాచరింప

నుద్యుక్తురాలుగా నుండుటను సర్పాకు కుండలంబుల ధరింప నుత్సుకురా లగుటను, నాకుండలంబులు పౌష్యుండను రాజు భార్యకుండలములుగా నుండవలయు ననుటను దెల్పి, "శక్తి గలవాఁడవైతేని వానిం దెచ్చి గురుదక్షిణగ నొసంగుము. నీవు వానిఁ దెచ్చి నా కొసంగుచో వానిఁ దాల్చి నేను బుణ్యకమును నోమి బ్రాహ్మణుల నర్చించెద." అని తనయభీష్టంబుఁ దెలుపఁగా నుదంకుండు వల్లె యని పౌష్యరాజుదేవి యుండు చోటునకుఁ బ్రయాణ మయ్యెను.

అట్లునుదంకుండు కుండలార్థంబు పౌష్యదేవిపాలికిం బోవుచుండ మార్గమధ్యంబున నొక గొప్పయెద్దు నెక్కి మహాపురుషుం డుదంకున కుఁ బ్రత్యక్షమై 'యోవిప్రవర్యా! తొల్లి నీగురుం డీవృషభ గోమయభక్షణంబుఁ గావించి యుండె. నీవు నట్ల యొనర్పుము. నీకు సకలశ్రేయస్సు లొనఁగూడు' ననెను. అంత నుదంకుండు వల్లె యని యట్లు చేసి యాచమించి కుండలార్థం బరిగి పౌష్యుం జూచి 'రాజా! నీదేవికుండలంబుల నర్థించి గురుదక్షిణ నొసంగువాఁడనై నీపాలి కేతెంచితి. వాని నా కొసఁగు మనఁగా నారాజర్షి యుదంకునకు మ్రొక్కి, నా దేవి యంతఃపురమున నున్నయది. నీ వచ్చోటి కేఁగి యడిగి తీసికొమ్ము. అనఁగా నుదంకుం డంతఃపురమున కేఁగి పౌష్యుదేవిం గానక మఱలి పౌష్యుపాలి కేతెంచి, 'రాజా! నీదేవి నీవు చెప్పిన ట్లంతిపురంబున లేదు. అసత్యం బేల యాడితివి?' అనెను. అంత పౌష్యుం డావిప్రవర్యు నితో నిట్లనియె. విప్రోత్తమా! నాదేవి పరమపతివ్రత గావున పరిశుద్ధు లగువారికిఁ దప్ప నొండొరులకుఁ గానరాదు. నీవు త్రిలోకములను నైతము పావనముసేయంగల మహనీయుఁడవు. నీ కశుచిత్వమును నే నారోపణ సేయుననంతవాఁడనే? అనఁగా నుదంకుండు తూర్పు దిక్కు మొగంబై పాదములను, చేతులను లెస్సగాఁ గడిగికొని యాచమించి మరల నంతఃపురమునకుఁ బోఁగా పౌష్యరాజుభార్య యుదంకున కెదు రేఁగి మ్రొక్కి యాసనం బిచ్చి యాగమనకారణం బడిగెను. అంత నుదం కుండు తాను గుర్వర్థముగాఁ గుండలంబులఁ దెచ్చి యిచ్చున ట్లొప్పికొనిన వృత్తాంతము నాదేవితో వక్కాణించి కుండలంబుల యాచించెను. అంతఁ బౌష్యరాజుదేవి తనకుండలంబుల నంతటవిసత్ప్రా

త్రంబున వినియోగింపఁగలందులకై తనభాగ్యము నభినందించుచు వెంటనే కుండలముల నుదంకున కొసంగుచు నిట్లనియె. "విప్రవరా! ఈకుండలములను గొనిపోవుటకుఁ దక్షకుండు సర్వదా వేచియుండును. కావున నప్రమత్తుండవై వానిబారిం బడక కొనిపొమ్ము" అని యుదంకుని వీడ్కొలిపె. పిదప నుదంకుండు మనోరథం బీడేఱఁ బౌష్యుం జేరి, "రాజా! నాయభిమతంబు కొనసాగినది. సెలవిమ్ము. పోయివచ్చెద" ననుటయుఁ బౌష్యుం డుదంకునితో నిట్లనియె. "ఓవిప్రవరా! నీవంటి మహానుభావుం డగువాఁడు నా కతిథి యగుట దుర్లభము. దైవికముగ నీవు నా కీనాఁడు లభించితివి. నే నిపుడు శ్రాద్ధంబుఁ జేసెదను. నాయాతిథ్యంబు బరిగ్రహించి నాయింట భుజించిపొమ్ము" అనెను. ఉదంకుండును సంతుష్టస్వాంతుండై రాజునింట భుజించుచుండఁగా నన్నంబు కేశదుష్టంబు కాఁగా నశుచియైన యాయన్నమును దనకుఁ బౌష్యుండు కుడుపఁబెట్టె నని కినిసి వాని నంధుండ గునట్లు శపించె. అంతఁ బౌష్యుండును తాను విప్రునకు దుష్టంబు కాని యన్నమును నిడినను విప్రుండకారణంబుగ నలిగి తన్ను శపించె నని తలంచి దాను నుదంకుని ననపత్యుండ వగు మని ప్రతిశాపం బొసంగె. అంత నుదంకుండు పౌష్యునితో నిట్లనియె. "రాజా! నీవు కేశదుష్టం బైనయపరిశుద్ధాన్న మని నేను నిరూపించినను నానిరూపణయం దనాదరణ గావించి నీయిడినయన్నము శుద్ధ మని తలపోయుటయగాక, నాకుఁ బ్రతిశాపంబు సైతమిచ్చితి గాదె. నీయిడిన యన్నంబుఁ జూడు" మనఁగాఁ బౌష్యుఁడయ్యది కేశదుష్ట మగుట నపరిశుద్ధ మయిన దని యెఱిఁగి, "విప్రవర్యా! కేశదుష్ట మైనయన్న మశుచియైనది. నాయజ్ఞానంబున నిది యిట్లయ్యె. నన్ను మన్నింపుము. నే నంధుండఁ గానోప. కరుణించి శాపమును గ్రమ్మరింపుము" అని వేడెను. అంత నుదంకుం డిట్లనియె. "రాజర్షి! నామాట యనృతంబు గానేరదు. కొంతకాలము నీ వంధుండవై యుండి పిదప దృష్టినొందుదు" వని ప్రసాదించెను. మఱియుఁ బౌష్యుని నాతండు తనకొసంగినశాపము గ్రమ్మరింపు మని యుదంకుండడుగఁగాఁ బౌష్యుం డిట్లనియె. 'బ్రాహ్మణోత్తమా! విప్రులకు మనస్సు గొప్పది, నవనీతమునకు సమానము, వారు పల్కుమాట దారుణాఖండల

శస్త్రతుల్యము. క్షత్రియుల కీరెండును విపరీతము లగును. వారిమనస్సు వాడియైన యంపమువంటిది. పల్కులు నవనీతసమానములు. నీశాపంబున నామన స్సింకను జల్లాఱదు; నేను శాపమును గ్రమ్మఱింపఁగా నేరను. నీవు శాపమును మరల్ప శక్తుండ వైతివి గాన మరల్చితివి. విప్రులు నిగ్రహానుగ్రహశక్తులు' అనిపలికెను. అదివిని యుదంకుండు కోప ముడిగి యచ్చోటు వాసి చనెను. అటు లతఁడచ్చోటు విడిచి గురునాశ్రమము వైపునఁ బోవుచుండ మార్గమధ్యమున నొక్కయరణ్యంబున నరుగువాఁ డొక్కచో జలాశయంబుం గని దానియుదకంబులసమీపమున శుచి యగుస్థలంబునఁ గుండలంబు లుంచి యాచమనముం జేయుట కుదక ముండుచోటి కేగఁగాఁ దత్పూర్వము మార్గమధ్యమునఁ దక్షకుండు నగ్నుండై క్షపణకవేషముం దాల్చి మానవాకారముతో నచ్చటచ్చట నుదంకునకుం గనఁబడుచు నదృశ్యుం డగుచు నున్నవాఁడు జలాశయం బునఁ గుండలంబుల నుదంకుండు పెట్టినదానిం జూచి వేవేగ నచ్చోటి కేతెంచి కుండలంబుల నపహరించుకొనిపోయెను. అంత నుదంకుండు వేగ ముగ నాచమించి వానివెంటం బరువిడి పట్టికొనఁగా వాఁడానగ్న వేష ముతో నున్న క్షపణకశరీరమును వదలి తక్షకరూపముఁ దాల్చియచ్చో నొకబిల ముండఁగా నందుఁ జొచ్చి పాతాళమునం దున్న నిజగృహముం జేరెను. అప్పు డుదంకుండు పౌష్యదేవివచనంబులం దలంచి యొకకఱ్ఱను గొని యాబిలమును ద్రవ్వఁ బూనియు నందుల కాతండు శక్తుఁడుకాక పోయెను. అంత నుదంకునియాదురవస్థ కింద్రుండు కరుణించి తనవజ్రా యుధమును బంపఁగా నయ్యది యుదంకుండు బిలమును ద్రవ్వ చుండుకఱ్ఱయం దావహించి దానిచే బిలప్రదేశమంతయుఁ బెకలించి పాతాళంబున నాగలోకంబు నమ్ముని చేరి నాగుల నందఱను మేలైన వాక్యములతో నుతించియు గుండలమ్ములఁ బొందనేరక మనమున వగ గదుర నాలోచించుచుఁ దన ముందఱ నల్లనిదియుఁ దెల్లనిదియు నగుపోగుల నోతప్రోతంబుగ నేయుచుండు స్త్రీల నిద్దఱను పండ్రెండు నేములు గలయొక్క చక్రమును ద్రిప్పుచున్న యార్గురుపిల్లవాం డ్రను, నుత్తమమైన యొకగుఱ్ఱమును, దానిపైఁ గూర్చుండియున్న

పురుషుం గాంచి వారి నెల్ల నర్థముగల మహామంత్రములతో నిట్లు స్తుతించెను.

శ్లో. త్రీణ్యర్పితా న్యత్ర శతాని మధ్యే
షష్టిశ్చ నిత్యం చరతి ధ్రువేऽస్మిన్,
చక్రే చతుర్వింశతి పర్వయోగే
షడ్వై కుమారాః పరివర్తయన్తి. ౧

శ్లో. తన్త్రం చేదం విశ్వరూపే యువత్యౌ
వయతస్తంతూన్ సతతం వర్తయన్త్యౌ,
కృష్ణాన్ సితాంశ్చైవ వివర్తయన్త్యౌ
భూతాన్యజస్రం భువనాని చైవ. ౨

శ్లో. వజ్రస్య భర్తా భువనస్య గోప్తా
వృత్రస్య హంతా నముచేర్నిహంతా,
కృష్ణే వసానో వసనే మహాత్మా
సత్యానృతే యో వివినక్తి లోకే. 3

శ్లో. యో వాజినం గర్భమపాం పురాణం
వైశ్వానరం వాహనమభ్యుపైతి;
నమోఽస్తు తస్మై జగదీశ్వరాయ
లోకత్రయేశాయ పురందరాయ.

అట్లు నుతింపఁగా నా యశ్వారూఢుం డగుమహాపురుషుం డుదంకుం జూచి యిట్లనియె. ఓవిప్రవరా! నీస్తోత్రముచే సంతుష్టుండ నైతి. నీ కెద్ది యిష్టమో వేఁడు మనెను. అంత నుదంకుండామహాపురుషు నితోఁ దనకు నాగలోకనాగముల నెల్ల వశపఱుపు మని ప్రార్థించెను. వెంటనే యాపురుషుం డాయశ్వముసపానమున నుదంకు నూఁదుమనెను. అది విని యుదంకుఁ డూఁదుచుండఁగనే యాయశ్వదేహమునుండి పొగ లగ్నికణంబులతో నెగయుచు నాగలోకం బంతయు నావరించెను. అంతఁ దక్షకుండు నాగలోకం బగ్నిచే దగ్ధ మగు నని వెఱచి వెంటనే కుండలములఁ దెచ్చి యుదంకున కొసంగెను. ఉదంకుఁడును వానిని గ్రహించి గురుపత్నికిఁ బుణ్యకవ్రతమునాఁడే యొసంగుటకు

వీలు లేదని వగతో నుండఁగా నాయశ్వారూఢుండైన పురుషుం డుదం కునకుఁ దనయశ్వము నొసంగి, 'ఓయీ! దీని నారోహించి వేగంబ గురు పత్ని సన్నిధానంబున కేగుదేని కాలవిళంబంబు కాకుండ నాదేవియభీ ప్సితంబు నెఱవేర్చి యాడినమాట తప్పనివాఁడ వయ్యెద' వని తెలిపెను. ఉదంకుఁడును నాగుఱ్ఱము నెక్కివచ్చి గురునాశ్రమంబు చేరి గురుపత్నికి నమస్కరించి కుండలంబుల సమర్పింపఁగా నాదేవియు, 'నోయుదంకా! సకాలంబున కరుదెంచితివి. ఇంకఁ గొంతయాలస్యం బగునేని నిన్ను శపింతు. మే లయ్యె. ఈప్సితార్థంబులఁ బడయుము' అని చెప్పి సెల వీయఁగా నుదంకుండు వేదుపాలికిఁబోయి నమస్కరించి వినతుఁడై నిలిచి యుండ నాయాచార్యుం డుదంకుని నాలస్యమగుటకుఁ గారణ మడిగెను. అంత నుదంకుం డిట్లనియె.

"గురువర్యా! వినుము. పౌష్య దేవిసన్నిధికి నేఁ బోయి గురుప్రార్థనంబు కుండలంబులు యాచింప నద్దేవి నిరాటంకముగ వాని నా కొసంగెను. వానిని నేఁదెచ్చుచుండ మార్గమధ్యంబునఁ దక్షకుండను నాగుండు నగ్న పురుషక్షపణకదేహుండై నావెంట వచ్చుచుఁ, గొంతవడి కదృశ్యుండగు చుండి యాకుండలముల నపహరించి పాతాళమున నున్న నాగలోకం బున కేఁగెను. నేను బవంపడినాగలోకముఁ బ్రవేశించి తక్షకు నొద్దనుండి క్రమ్మఱఁ గుండలంబులఁ దెచ్చుట కింత తడ వయ్యెను. మఱియును నాగ లోకంబునఁ దెల్లనినల్లనిదారముల నేయుచున్న స్త్రీల నిద్దఱను బొడగాం చితి. పండ్రెండాకులతో నొక్కచక్రముం ద్రిప్పుచున్న వారి నార్వురు కుమారులం గంటి. ఒకమహనీయాశ్వంబును దాని నారోహించిన యొకమహాపురుషుం జూచితి. ఇంతేకాక పౌష్యనగరమునకుఁ బోవుమా ర్గమున నొకవృషభమును, దానిపై నున్న మహనీయుం డగుపురుషు నొక్కని వీక్షించితి. ఆపురుషుండు నన్నుఁ గాంచి 'ఓయీ తొల్లి యీ వృషభగోమయము నీగురుఁడు భక్షించెను. గావున నీవును దీనిని దినుమ'ని నియోగించెను. మహనీయుం డగు నాపురుషుండు చెప్పినట్లు నే నొనర్చితి. వీనిలో నాకొక్కటియును దెలియకున్నది. కాన సవిస్తరముగ వానికలరూపుల నానతిం"డనుటయు నాచార్యుం డగు వేదుం డుదంకున కిట్లనియె. వత్సా! నీకుఁ గనఁబడిన సితాసితతంతువులను నేయుచుండిన స్త్రీ

లిరువురను ధాతయు విధాతయు నాఁబడుదురు. నల్లనితంతువులు రేల నియుఁ, దెల్లనివి పగ ళ్లనియుఁ దెలియుము. ద్వాదశారంబగుచక్రము పండ్రెండుమాసములతో నుండు సంవత్సరకాల మనియు, దానిం ద్రిప్పు చుండు నార్గురు కుమారులు షడృతువు లనియుఁ బురుషుఁడు పర్జన్యుఁ డనియు, నాయశ్వం బగ్ని దేవుం డనియు, నీవు గాంచినవృషభం బైరావతం బనియు, దాని నారోహించియుండిన మహాపురుషుం డింద్రుం డనియు, నీవు భక్షించినగోమయం బమృత మనియు, నాయమృ తము నుపయోగించుటంజేసి కాదే నీకు నాగలోకమునందు సంచరించు టకు వలను పడిన దనియు, నింద్రుఁడు నాసఖుఁ డగుటంజేసి నీయె డను బ్రసన్నుఁడయ్యె ననియు, వానిప్రసాదంబున నీవు గ్రమ్మఱనాగలో కంబు నుండి తక్షకాపహృతకుండలములఁ దేఁ గల్గితి వనియు నెఱుం గుము. గురుదక్షిణ నొసంగితివి. నీయెడ సంతుష్టుండనైతి నని చెప్పి యుదంకునకు నిశ్శ్రేయస్సుల నొసంగి వేదుండు సెల విచ్చి పంపఁగా నయ్యుదంకుండు తక్షకుండు తన కొనర్చినమహాపకారమునకుఁ బ్రతీకా రంబు సేయం దలంచి హస్తినాపురమునకుఁ బోయి రాచనగరుఁ బ్రవే శించి, సామాత్యుండగు జనమేజయభూపాలుం గాంచి యాతండు తన్ను వినయపూర్వకంబుగ లేచి యాదరింప నారాజుం దీవించి యాతనితో నిట్లనియె.

### ఉదంకుండు జనమేజయుని సర్పయాగోన్ముఖుం జేయుట

రాజపుంగవా ! ముఖ్యముగఁ జేయఁదగిన కార్యముల జేయక యేల యాలస్యము గావించుచున్నాఁడవు ? అనఁగా నమ్మునీంద్రున కారాజేంద్రుం డిట్లనియె. భగవంతుఁడ వగు నుదంకమునీంద్రా ! వంశ క్రమాగతం బగు రాజ్యంబును విధ్యుక్తధర్మములతోఁ బాలించుచు క్షత్రియకులాచారంబుల నడుపుచున్నవాఁడ. నే నిప్పు డవశ్యముగ నాచ రింపవలసినకార్యము నానతిమ్ము. అనిపలుక నుదంకుం డిట్లనియె. రాజకు లోత్తమా ! నేను నాయాచార్యునకు గురుదక్షిణగా నిచ్చుటకై పౌష్యదేవికుండలంబులఁ గొని తెచ్చుచుండఁగా, దురాత్ముం డైనతక్ష కుం డను నాగుం డాకుండలంబుల నపహరించుకొనిపోయె. దానిం

గ్రమ్మరఁ దెచ్చుటకు నా కెంతయేని శ్రమ కలిగె. నాగురుసఖుండైన మహేంద్రునియనుగ్రహంబు నాకుఁ గలిగియుండుటంజేసి యవి నాకు తక్షకునియొద్దనుండి మరల సంప్రాప్తము లయ్యె. మఱియు, నాతక్షకుండు బలదర్పములతోఁ గూడినదురాత్ముండు. వాఁడు గాదే రాజర్షియును, పరమధార్మికుండును మహేంద్రోపముండును నగు మాతండ్రి పరీక్షిత్తు నకారణంబుగఁ గఱచి శరీరమును ద్యజింపఁజేసె. మఱియును దక్షకుండు కఱచుచో వానికాటునకౌషధం బొసఁగి మాతండ్రి ప్రాణంబులను రక్షింప నేతెంచుచుండిన కాశ్యపుం డను ఋషివర్యుని దారిలో నడ్డగించి వానికి వలసిన యపరిమితధనంబు లొసంగి యమ్మునిని మాతండ్రి యొద్దకు రానీయక క్రమ్మరించె. ఇట్టిమహాపాపియైన యాదురాచారుఁ దక్షకునిం ద్వరితముగా నగ్ని కాహుతిఁ గావింప నుద్యుక్తుండవై సర్పయాగం బొసర్పుము. అనిచెప్పఁగా జనమేజయుండు తక్షకునకుం గనలి హావిస్సుచే నుద్దీపితమై తేజోవంతమైనయగ్నియుంబోలె సుదంకువాక్యములచే మండి పడి సర్పయాగమున కుపక్రమించె. అని చెప్పఁగా విని శౌనకుండు భృగువంశ చరిత్రమును జెప్పు మని సూతు నడిగెను. అంత సూతుం డిట్లనియె.

## భృగువంశచరిత్రము

పూర్వము వరుణుం డొకమహాయజ్ఞము గావించెను. ఆయజ్ఞమునందు బ్రహ్మ హోమము చేసెను. అప్పు డాయగ్నినుండి భృగు వుదయించెను. భృగువు పులోమ యనుదానిని వివాహమాడెను. వారికి చ్యవనుండు పుట్టె. చ్యవనునకుఁ బ్రమతి జనించె. ప్రమతి ఘృతాచిని బెండ్లాడి రురుం గనెను. రురునకుఁ బ్రమద్వర భార్యయై వేద పారగుఁడగు శునకుం గనియె. ఆశునకుఁడు ధర్మాత్ముండును, దపస్వియుఁ, గీర్తిమంతుండును, సత్యవాదియు, నియతాశనుండును, బ్రహ్మవేత్తయును నై వెలయుచుండె నని చెప్పుచుండఁగా శౌనకుఁడు సూతుని ట్లడిగెను. ఓ పౌరాణికశ్రేష్ఠుఁడా! భృగుకుమారుఁడైనచ్యవనునకు నావే రెట్లు గలిగె? వివరించి చెప్పు మనఁగా సూతుం డిట్లని విన్నవించెను.

భృగువు పులోమ యనుపుణ్యాంగనను మంత్రపూర్వముగ వివాహమై యాసతీమణికి గర్భాధానం బొనర్చి యాదేవి గర్భిణిగా నుండు

నప్పు డొకనాఁడు భృగు వాసాధ్వి నాశ్రమరక్షణకొఱ కగ్ని గృహం
బునం దునిచి యేటికి స్నానమునకుఁ బోయెను. అంతఁ బులోముం
డనురక్కసుం డాసమయమున నాశ్రమంబు సొచ్చి పులోమచే నతిథి
సత్కారంబుల నొందుచు నాసుందరాంగి యాకారంబునకు మోహించి,
తాను పూర్వ మాసతినిఁ బెండ్లాడ నిశ్చయించి యుండ నాదేవి
జనకుండు భృగువున కొసంగి వివాహముం జేయుటయుం జింతించి యగ్ని
గృహంబునఁ బ్రజ్వలించుచుండు హుతవహుంగని 'యోహవ్యవాహనా!
నీముఖంబున దేవతలు హవిస్సుం గొందురు. తొల్లి నే నీమెను వరించి
యుండ దీనితండ్రి వేదవేదాంగముల నెఱింగినవాఁడని కాదే భృగువునకు
సమంత్రకంబుగ నొసంగి వివాహముఁ జేసెను. ఇది నీ వెఱింగినదియే
కదా?' అనఁగా నగ్నిదేవుం డసత్యమునకు వెఱచి యిట్లనియె. ఈయంగ
నను నీవు పూర్వము వరించియున్నను, దీనితండ్రిని భృగుమహర్షి తన కిచ్చి
వివాహము గావింపు మని వేడఁగా నాతం డియ్యకొని సమంత్రకంబుగ
భృగువున కొసంగి వివాహము గావించె నని చెప్పఁగా నారక్కసుం
డగ్నిమాటల నాదరింపక, వెంటనే వరాహరూపము నెత్తి యబల
యగుపులోమ నెత్తికొని పాఱెను. ఇట్లు రాక్షసాపహృతయైన పులోమ
యతిభీతురాలై కోపావేశముననుండ గర్భముననున్న మునికుమారుండు
గర్భమునుండి చ్యుతుం డయ్యెను. గర్భము చ్యుతము కాఁగాఁ బుట్టిన
వాఁడు గాన నమ్మునికుమారుండు చ్యవనుండు నాఁ బరఁగె. గర్భమునుండి
యాదిత్యునితేజస్సుతోఁ బుట్టిన యామునికుమారు దివ్యతేజస్సుచే
నారక్కసుండు దగ్ధుం డయ్యె. ఆయద్భుతమునకు దుఃఖమునకు నోర్వ
లేక, యేడ్చుచున్న యనిందిత యగు పులోమకడకుఁ బితామహుం
డేతెంచి యామె నుపశమింపఁజేసి యామెకన్నీటిచే నెల్లువఁగాఁ బాఱఁ
జొచ్చిన భృగ్వాశ్రమప్రాంతపుఁ గాలువకు వధూసర యని పేరిడి పితా
మహుండు యథేచ్ఛం జనియె. పులోమయు శిశు వగుచ్యవను నెత్తి
కొని యథాక్రమంబుగ నిజాశ్రమమును జేరెను. అంత స్నానార్థ మరిగిన
భృగువు నిజాశ్రమమున కేతెంచి సకలవృత్తాంతంబును నెఱింగి రక్కసు
బారినుండి తనభార్య నగ్నిహోత్రుండు తప్పింపకుండినందుల కలిగి

యగ్ని హోత్రుని సర్వభక్షకుండ వగుదు వని శపించె. అప్పుడు వీతి హోత్రుం డమ్మునికి ట్లనియె.

విప్రవరా! నేను సాక్షిని. నన్ను శపింప నీ వెట్లు సాహసించితివి? సాక్షియైనవాఁడు తనకుఁ దెలిసినదానిని దెలియపన్నను, దెలిసినదాని కెవ్విధముగ వ్యత్యస్తముగఁ బల్కినను, దనకు ముందటివా రేడ్వురకును తనకు వెనుకటివా రేడ్వురకును నరకావాసంబుఁగల్గించి తానును నరకంబు నకుఁ బోవును. కావున నే నెఱింగినదానిం జెప్పితి. దానం జేసి నీవు శపింప నేఁ జేసినదోషం బెయ్యది? నేను ప్రతిశాపం బీయ శక్తుండ నైనను నాకుఁ బ్రాహ్మణులయెడఁ గడుఁ బ్రీతి గావున నీకుఁ బ్రతిశాపం బీనోప. వారినిఁ బూజ్యు లని నేఁ దలంతుఁ గావున నూరకుండెద. అయి నను నాముఖంబున దేవతలు హవ్యంబును, బితరులు కవ్యంబును గొం దురు. అట్టి నే నెట్లు సర్వభక్షకుండ నగుదును?అని వచించి యగ్ని దేవుండు తనమూర్తి నుపసంహరించికొనఁగా లోకంబున యాగాదు లగు నగ్ని నిర్వాహ్యంబులగు సర్వకార్యంబులును లోపించె. అమావాస్యాది దిన ములయందుఁ బితరులకార్యములును, బూర్ణిమయందు దేవతలకార్యము లును మున్నగ్నిముఖంబునఁ గావింపఁబడుచుండినవి. అగ్ని లేకపోఁగా లోకకార్యంబు నిలిచె. మునులెల్ల రాహారవంబులతోను దేవత లాశ్చ ర్యముతోను బితామహునిపాలి కరిగిరి. అగ్నికి భృగుమహర్షి యొసంగిన శాపంబు కారణంబుగ నగ్ని తనతేజస్సు నుపసంహరించుకొనుటయుఁ, దానం జేసి లోకయాత్ర సాగమియుఁ, గ్రియాలోపములను, దేవతలును మునులును బ్రహ్మకు విన్నవించిరి. అంతఁ బరమేష్ఠి యగ్ని దేవునిఁ దనకడకు రప్పించి సాంత్వవచనముల నిట్లనెను. ఓయగ్నిభట్టారకా! నీవు లోకములకుఁ గర్తవు. కర్మలు నీమూలమున లోకమునందుఁ బ్రవర్తిల్లుచుండుటచే నీవు ముల్లోకములను ధరించువాఁడవు. క్రియలకు లోపము వాటిల్లకుండ లోకయాత్ర నడుపుము. నీవు ముల్లోకములయం దెల్లప్పుడును బవిత్రుఁడవు. సర్వభూతములకును నీవ గతివి. భృగుశాపం బున నీకుఁ గల్గిన సర్వభక్షకత్వంబున నీ కెట్టి యశుచియుఁ గలుగదు. నీవు సదా పరమశుచివి. నీవు జ్వాలామూర్తివి గావున నశుచిపదార్థము

లను నపానజ్వాలికలచేతను, గ్రవ్యాదమూ_ర్తివై యభోజ్యపదార్థము లను భక్షించుచుందువుగాత!

ఎట్లు సూర్యకిరణములు సోఁకిన నశుచిపదార్థము లెల్లను శుచి యగునో యట్లే యభోజ్యములును నపాయములును నీచే దగ్ధమై శుచిత్వమునొందును. స్వభావము చేతనే నీవు పరమతేజోమూ_ర్తివి. నీతేజస్సు చేతనే ఋషిశాపమును సత్యవంతమైనదిగ నొనర్పుము. నీముఖమున దేవతలకుఁగా హోమముచేయఁబడిన హానిలో నీభాగమును బరిగ్రహింపుము. అని బ్రహ్మ వేఁడుకొనఁగా నగ్నిదేవుం డియ్యకొని లోకకర్మముల యథావిధిఁ బ్రవ_ర్తింపనియ్యకొనియె. అట్టి భృగుమహర్షికిఁ బులోమయందుఁ జ్యవనుండును, నాచ్యవనునకు సుకన్యయనునంగనామణి యందుఁ బ్రమతియుఁబుట్టిరి. అతండు ఘృతాచి యనుదానిం బెండ్లియై యద్దేవియందు రురునిఁగనెను. ఆరురునకు భార్యయైన ప్రమద్వరకు శునకుండు పుట్టె నని ముందుఁ జెప్పితిం గాదె. ఆరురుచరిత్రము, నోవిప్రో_త్తములారా, సవి_స్తరంబుగఁ జెప్పెద నాకర్ణింపుఁ డని వారలకు సూతుండు వెండియు ని ట్లనియె.

## రురుచరిత్రము

పూర్వ మొకప్పుడు మేనక యను దేవవేశ్య విశ్వావసుం డను గంధర్వుంబొంది యొకకన్యకంగనియె.ఆకన్యను మేనక స్థూలకేశునియాశ్రమము దాపునగని దయమాలి నదీతీరమున విడిచిపోయెను.స్థూలకేశుండు స్నానార్థమేటికిఁ బోయి యందు నిర్జనప్రదేశమున నొకబాలికం జూచి కృపాళుండై యాశిశువును జనయాశ్రమంబునకుఁ జేర్చి దానిం బెంచెను. అటులు పెనుచుచునతఁడాబాలికకు జాతకర్మాదులను విధ్యు_క్తంబుగ నొనర్చి యాశ్రమములోని ప్రమదాజనంబుల నయ్యది పరిష్ఠ యగుటచే దానికిఁ బ్రమద్వర యనుపేరిడెను.అంతఁ బ్రమద్వర మునియాశ్రమంబున శుక్లపక్షశీతకరరేఖవలె దినదినప్రవర్ధమానయై నిండుయౌవనంబుఁ బడసె. అప్పు డొక్కనాఁ డాయాశ్రమమునకుఁ బ్రమతి ఘృతాచులకుమారుండు రురుం డేతెంచి దానిసౌందర్యమునకును, జవ్వనంబునకును నచ్చెరువందుచు దానియందుఁ దవిలినమనస్సుతోఁ దండ్రిపాలికిం బోయి తన యభీష్టంబు దండ్రికిఁ జెలికాండ్రచేఁ దెలుపఁగాఁ బ్రమతి స్థూలకేశుని

యాశ్రమమున కరిగి యమ్మునితో నిట్లనియె. మునివర్యా! నీయాశ్రమంబునఁ బెరుగుచున్న ప్రమద్వర యనుసుందరాంగిని నాకుమారుండు వలచియున్నవాఁడు. ఆదేవిని నాకుమారుఁడగు రురున కొసంగి విధ్యుక్తవివాహముఁ గావింపవలయును. ఇదియ నావచ్చినకార్య మని చెప్పఁగా స్థూలకేశుండు మిక్కిలి సంతసిల్లి కన్య నిచ్చుట కొడంబడియొక సుముహూర్తమునఁ బూర్వఫల్గునీనక్షత్రసమయమునందు విభవముతోఁ బ్రమద్వరారురువులకు వివాహము గావింప నిశ్చయించెను. అంత నాశుభముహూర్తదినమునకుఁ గొన్నినాళ్లు మునుపు ప్రమద్వర తన చెలికత్తెలతో నాశ్రమసమీపవనమునందు విలాసముగఁ గ్రీడించుచు నొకపామును హఠాత్తుగాఁ దనపదంబునఁ ద్రొక్కెను. నిదురించుచుండిన యప్పా మదిరిపడి మేల్కొని రోషముతోఁ బ్రమద్వరం గఱచెను. ప్రమద్వరయు నప్పామువిషము తలకెక్కి మూర్ఛిల్లి విగతాసువయ్యెను. అట్లు విగతప్రాణయగు తనకూతుఁ దండ్రి మున్నగునాశ్రమవాసు లెల్లరుం జూచిరి. కాని యెవ్వరును దాని విషనిర్ముక్తగాఁ జేయలేనివారైరి. ఆముద్దులుగులుకుచుండిన పూఁబోఁడి శరీరమునుజూచుటకయ్యాశ్రమవాసులగు నాత్రేయ, మహాజాను, గౌతమ, కుశిక, శంఖ, మేఖల, ఉద్దాలక, కఠ, శ్వేత, భరద్వాజ, కౌణ, కుత్స్య, ఆర్ష్టిషేణాదిమునులును, బ్రమతియు నాతనికుమారుం డగురురువును వచ్చి ప్రమద్వరయాకస్మికమరణమునకుఁ జింతిల్లుచుండిరి. రురువుమాత్ర మాసుందరాంగినిఁ దా వివాహమాడుటకు విధి యాటంకపెట్టెనే యని బోరన నేడ్వఁజొచ్చెను; కాని, వాఁడంత నచ్చో నిలువ లేక యరణ్యంబున కేఁగి బహువిధంబుల నాకన్యకై పనవిపనవి యేడ్చి తుద కిట్లు ప్రతిజ్ఞ చేసెను. నేను దానములఁ జేసినవాఁడ నగుదునేని, తపంబుల ననుష్ఠించినవాఁడ నైతినేని, పెద్దలఁ బూజించినవాఁడ నైతినేని, గురువుల నారాధింతునేని, పుట్టినదిమొదలు నియతవ్రతాచరణపరాయణుండ నగుదునేని యీప్రమద్వర జీవతంతురా లగును గాక యని శపథములు పల్కుచుండఁగా దేవదూత యొక్కండు డాకసంబున వానికి నేత్రగోచరుఁడై 'యోమునికుమారా! నీ వేల యిట్లాపూఁబోఁడికై వగచెదవు. అది జీవించుట కుపాయంబొం

డు కలదు. దాన నాయబల పునర్జీవితురా లగును. నీయాయుస్సునం దర్ధమాసుందరికి దారవోయుము. వెంటనే దానికిఁజైతన్యంబు గలిగి జీవవంతురా లగు నని దేవతలు నీతోఁ జెప్పుటకు న న్నంపిరి. అనిపల్క రురుం డట్లయగు గాక యనెను. అచ్చట దేవలోకంబునఁ బ్రమద్వరతండ్రి యగు విశ్వావసుండును దేవదూతయును వెంటనే యమునిపాలి కరిగి ప్రమద్వరకు రురుం డనుమునికుమారుండు తనయాయుస్సునం దర్ధం బొసంగె. ఇంక దాని భూలోకంబున కనుపు మని ధర్మదేవతతోఁ జెప్పఁగా నాతం డట్ల చేసి యాకన్యకను బునర్జీవితురాలిగఁ జేసెను. ఇటఁ బ్రమద్వర వెంటనే చేతనముగలదై చేతులుం గాళ్లును గదలఁగా గాఢనిద్ర వోయి మేల్కాంచినదియుంబోలె లేచి యచ్చో నున్నవారి కానందంబును దండ్రికి హర్షాశ్రువులుం గలుగఁజేసెను. వెంటనే రురుం డేతెంచి తనకోరినయంగనామణి ప్రాణవంతురాలు కాఁగా తనయాయుష్యంబునం దర్ధం బొసంగి దానిం బ్రతికించినవాఁడగుట నొక్క సుముహూర్తంబున నానెలఁతను బెండ్లాడెను. అప్పటినుండి రురుండు సర్పములయెడ దీర్ఘక్రోధము గలిగి యెచ్చటఁ బాముం జూచిన నచ్చోటనే దాని నొక్కకఱ్ఱతో నిర్దయుండై చంపుచుండె. అంతనొక్కనాఁడు వనమధ్యంబునఁ బోవుచున్న రురుండు డుండుభంబు నొక్కదానిం జూచి సక్రోధుండై దానిం జంపఁ గఱ్ఱనెత్తఁగా నాడుండుభము రురున కిట్లనియె. 'మునికుమారా! న న్నేల చంపఁబూనెదవు? నీకు నేమి యపకృతిం గావించితి.' నని యడుగఁగా రురుండు దాని కిట్లనియె. 'తొల్లి యొక విసపుఁబుర్వు నాప్రియురాలిని నదయయై కఱచె. నాఁటఁగోలె నేను జూచుపాముల నెల్ల జంపుట నావ్రతం' బనఁగా నతనికి డుండుభము వెండియు నిట్లనియె.

ఓభూసురోత్తమా! ఇతరము లగు పాములు గఱచి జీవులఁ జంపునట్లు మావంటి యిరుదలలశిఖండు లెవ్వరిం గఱవవు. ఏదోయొక పాము నీకపకారము గావించె నని పాముల నెల్లం జంపుట యేపాటి ధర్మ మగును? కావున నీ వీపాముల నిట్లకారుణికుండవై చంపుట మానుము. అని చెప్పఁగా రురుండు తన కాడుండుభము హితవు చెప్పె నని తలంచి దానిం జంపక విడిచిపుచ్చె. అంత నాడుండుభము తన సర్పశరీ

రమును పవలి మునీంద్రరూపము దాల్చిన, రురుం డద్భుతంబంది నీవు డుండుభరూపము నెట్లు విసర్జించి యీఋషిరూపంబుం దాల్చితివి? నీచరితంబుం నాకద్భుతావహంబై యున్నయది. నీకలరూ పెఱింగింపవే యన నామునీంద్రుండు ప్రమద్వరభర్త కిట్లనియె.

ప్రమతిపుత్త్రుఁడా! ఋషీశ్వరుఁడా! నాకలరూ పెఱింగించెద సావధానుండవై వినుము. పూర్వ మొకప్పుడు నేను సహస్రపాదుం డనుపేరితో నొక ఖగముం డను చెలికానితోఁగూడి వర్తింపఁ గ్రీడించుచుంటి. అప్పు డొక్కనాఁడు ఖగముం డగ్నిహోత్రగృహంబున నుండఁగా నేను విలాసార్థ మాతనిపైఁ దృణముతో నొక్కసర్పాకారమును నిర్మించి యాతనిపై వైచితి. ఆసర్పాకారముతో నున్నగడ్డిపోచ పైఁబడఁగా నాతండు దానిని యథార్థసర్ప మని భ్రమసి యదరిపడి మూర్ఛిల్లెను. పిమ్మట ఖగముండు కొంతసేపటికి మూర్ఛదేఱి నన్ను గ్రోధాయఁణితలోచనుండై చుఱచుఱం జూచి యచేతనం బగు నీతృణసర్పమును నాపై వైచి నన్ను వెఱపించితివి కావున నిర్వీర్యంబైన డుండుభంబ వగు మని శపియించె. నే నాతని తపోమహత్త్వము నెఱింగినవాఁడ నగుటం జేసి శాపభీతుఁడనై వానికి గేల్దోయి జేసి మ్రొక్కి యిట్లంటిని. మహాత్మా! నీవు నాకు చెలికాఁడ వని యాతృణసర్పంబును నీపై విలాసంబునకు వైచితిం గాని నాయెడఁ గ్రౌర్యంబు లేదు. నా ప్రార్థన మంగీకరించి శాపంబును మరల్పవే? నన్ను ననుగ్రహింపవే? యని పలుదెఱఁగులఁ బ్రార్థించిన నతండును బ్రసాదంబునం జేసి యనుగ్రహించి నాకు శాపవిముక్తి యిట్లని నుడివె. "నీకు భృగుకులసంజాతుండగు రురునితో సంభాషణంబును, నాతనిదర్శనంబును నెన్నండు గల్గునో నాఁడు నీకు శాపమోక్షణం బగు" నని చెప్పి నాతో వెండియు నిట్లనియె. ఓయీ! అహింస పరమధర్మము. భూసురు లెట్టిప్రాణికిని హింస చేయరాదు. శ్రుతులుభూసురులు పరమశాంతులని నుడువును. వారు సత్యవంతులనును. ఉగ్రమగు దండధారణము క్షత్త్రియధర్మము. మరియు భూసురులకు శాంతి,అహింస, వేదాధ్యయనము, సాధుశీలత్వము, సర్వభూతములకు నభయదానబుద్ధి సహజధర్మము. ఇట్లుండ నీవు బ్రాహ్మణుండవై పుట్టి క్షత్త్రియకులోచితంబైనదండధారణముం బూని యిట్లు పాములను వధించుట నిజ

కులోచితధర్మము కానేరదు. ఇట్లే పూర్వకాలంబున జనమేజయుం డను రాజచంద్రుండు సర్పయాగ మొనర్ప నందు సర్పకులమునకుఁ బ్రళయం బయ్యె. అప్పు డస్తీకుం డనుఋషివర్యుం డాసర్పయాగంబును నివారించె" నని చెప్పి తొల్లి డుండుభరూపంబుతో నున్న సహస్రపాదుం డనుఋషీశ్వరుండు రురుదర్శనంబునను సంభాషణంబునను శాపవిముక్తుండై యదృశ్యుం డయ్యె. అంత రురుండు తండ్రి యగుప్రమతి పాలికిం జని తనకును డుండుభమునకును జరిగినవృత్తాంతం బంతయు సవిస్తరంబుగాఁ జెప్పె ననిన శౌనకాదు లగు నమ్మును లుప్పౌరాణికునితో నిట్లనిరి.

రౌమహర్షణీ! ఏకారణంబున జనమేజయుఁడు సర్పయాగము నాచరించె? దాని నస్తీకుం డేల నివారించె? జనమేజయు యాగాగ్ని యందు సర్పంబు లేమికారణంబునఁ బడి నశించె? ఇవియంతయును సవిస్తరంబుగా మాకుఁ జెప్పవలయు ననిన వారలకు ఉగ్రశ్రవసుం డిట్లనియె.

తొల్లి కృతయుగంబునఁ గశ్యపప్రజాపతికిఁ గద్రువ, వినత యను భార్య లిరువు రుండిరి. వా రిరువురును మగనిమనస్సు సంతోషించునట్లు లెస్సగాఁ బరిచర్యలను సలుపఁగా నొక్కనాఁడు కశ్యపుండు వారిం బిలిచి యిట్లనియె. ఓవనితలారా! మీశుశ్రూషం జేసి సంతుష్టుండ నైతి. మీ కెద్దియేని వరంబులు వలయు నేని కోరుకొనుఁడు. అని చెప్పఁగాఁ గద్రువ తనకు బలపరాక్రమవంతు లగు పుత్త్రుల వేవుర ననుగ్రహింప వేఁడెను. వినతయుఁ గద్రువపుత్త్రులకన్నఁ దేజోబలవీర్యంబులుం గలవారి నిద్దఱఁ బ్రసాదింప భర్తను బ్రార్థించెను. అంతఁ గశ్యపుండు వా రిరువుర కోర్కులు సమకూఱున ట్లనుగ్రహించి యిరువురను దమతమగర్భంబుల యథావిధి రక్షించుకొనుఁ డని, యాలోచనాపూర్వకంబుగాఁ జెప్పి తపంబునకుఁజనియెను. అంతఁ గొంతకాలమునకుఁ గద్రువ వేయిగ్రుడ్లను, వినత రెంటినిం గనిరి. వానిని వారిపరిచారికలు నేతికుండలలోఁ బెట్టి కాపాడుచుండిరి. ఆగ్రుడ్లు జనించిన యేనూఱేండ్లకుఁ గద్రువకు జనించిన గ్రుడ్లన్నియుఁ బిల్లలై నాగకుమారులు వేవురు గల్గిరి. ఆనాగులలో శేష, వాసుకి, ఐరావత, తక్షక, కర్కోటక, ధనంజయ, కాళియ,

మణినాగ, ఆపూరణ, పింజరక, ఏలాపుత్ర, వామన, నీల, అనీల, కల్మాష, శబళ, ఆర్యక, ఉగ్రక, కలశపోతక, సురాముఖ, దధిముఖ, విమలపిండక, ఆప్త, కర్కోటక, శంఖ, వాలిశిఖ, నిష్ఠానక, హేమగుహ, నహుష, పింగళ, బాహ్యకర్ణ, హస్తిపద, ముద్గరపిండక, కంబళ, అశ్వతర, కాళీయక, వృత్త, సంవర్తక, పద్మ, శంఖముఖ, కూష్మాండక, క్షేమక, పిండారక, కరవీర, పుష్పదంష్ట్ర, బిల్వక, బిల్వపాండర, మూషకాద, శంఖశిర, పూర్ణభద్ర, హరిద్రక, అపరాజిత, జ్యోతిక, శ్రవహ, కౌరవ్య, ధృతరాష్ట్ర, శంఖపిండ, విరజస్, సుబాహు, శాలిపిండ, హస్తిపిండ, పిఠరక, సుముఖ, కౌణపాశన, కుఠర, కుంజర, ప్రభాకర, కుముద, కుముదాక్ష, తిత్తిరి, హలిక, కర్దమ, బహుమూల, కర్కర, అకర్కర, కుండోదర, మహోదరు లాదిగాఁగలవారు వేయిమంది నాగులు పొడమిరి. అంత వినత తనయండంబులు రెండును నెన్నినాళ్లే కవియకుండఁగా వానిలో నొక్కదానిని జిదుగఁగొట్టె. అప్పుడు దాని నుండి పూర్వశరీరము మాత్ర ముత్పన్నమై యధశ్శరీరావయవము లింకను గలుగకుండి తేజోవంతుఁడైన పుత్త్రుం డొకఁడు దోఁప వాఁడు తల్లిపై నలిగి తన కవయవసంపూర్తి కాకుండఁగనే తానున్న యండంబును దల్లి యవియించినందులకు దానిసవతి కది దాసురాలై యుండునట్లు శపించె. అప్పుడు వినత కుమారుని, దీనాననముతోఁ జూడఁగాఁ బుత్త్రుండు తల్లినిఁ గరుణించి యిట్లనియె. తల్లీ! యీ నీ రెండవయండ మును ద్వరపడి పగుల్పకుము. అది క్రమముగ వృద్ధినొంది యింక నేనూఱేండ్లకుఁ దనకు దా నవియును, దానియందుండు నీపుత్త్రుం డురుతేజోబ లుండు. వాఁడు నీదాస్యం బుడుపును. అని చెప్పఁగా, వినత యంతకా లము నాయండంబును రక్షించుచుండ నయ్యది సకాలమున కవియఁగా దానినుండి విశిష్టతేజస్సంపన్నుం డగు గరుడుండు పుట్టి యాకసంబున కెగసె. ఇది కద్రువవినతలకుమారులయుత్పత్తిప్రకారంబు. ఇట్లుండ నాక శ్యపభార్య లగుక ద్రువయు వినతయు నొక్కనాఁడు విలాసవతులై సము ద్రతీరంబునఁ జరింపఁబోయి యమృతము నుత్పాదించుటకు దేవ దానవు లిమవురును మంథరపర్వతమును గవ్వముగాను, వాసుకిం ద్రాడు గాను జేసికొని క్షీరసాగరమును ద్రచ్చుచున్నసమయంబున నాపాల

సంద్రమునుండి యమృతముతోఁ బుట్టి యాసముద్రతీరమునఁ దిరు
గాడుచు నమోఘబలము గలిగి లోకములోనియశ్వములలో మేలై
శ్రీమంతమై అజరమై సర్వలక్షణములతోఁ గూడుకొనినయుచ్చైశ్శ్రవ
మను పేరు గలయశ్వరాజముం గాంచిరి. అని సూతుండు చెప్పుచుండఁగనే
శౌనకుండు దేవతలును దానవులును నిరువురుంగూడి క్షీరసముద్రము
నేల ద్రచ్చిరి? ఆవృత్తాంతమును సవిస్తరముగఁ దెలుపు మని యడు
గఁగా నాసూతసుతుం డగుకథకుం డమ్మునిశ్రేష్ఠున కిట్లని చెప్పందొడంగె.

## క్షీరసాగరమథనము

మునిశ్రేష్ఠా! వినుము. తనయపారమైనతేజముచే భువనముల
నన్నింటిని బ్రకాశింపఁ జేయుచున్న సూర్యునికాంతికంటె నధికమై
స్వయంప్రకాశముతోను, బంగారుచాయతోను వెలుఁగుచుండు మేరు
పర్వతశిఖరమునందు నారాయణుఁ డాదిపురుషుం డుండ నచ్చోటికి దేవత
లేఁగి తమ కమృతంబు గావలయు నని కోరిరి. అంత నయ్యాదిదేవుండు
వారితో ని ట్లనియె. మీరును దానవులును నొక్కటై పాలసముద్రము
నందు సకలౌషధులను వైచి మందరపర్వతమును గవ్వముగా నమర్చి
కొని చిలుకఁగా నమృతం బుత్పన్నమగును అని చెప్పఁగా దేవత లంద
ఱును బదునొకండువేలయోజనంబుల పొడవును, నంతియ లోతునుం
బాతుకొనియున్న మందరనగముం జేరి దాని నున్నతావునుండి పెకలింప
యత్నించిరి. కాని, యెంత ప్రయత్నముం జేసినను నాపర్వతము కదలదయ్యె.
అంత వారందఱుంగూడి మఱల మేరుశిఖరంబునఁ దేజోవంతుండై స్వయం
ప్రకాశమూర్తితో వెలుఁగుచుండు నారాయణుం బొడఁగాంచి యిట్లనిరి.
దేవా! నీ వానతిచ్చినచొప్పున మేము సమస్తపన్నగములచే నావ
రింపఁబడినదియు, ననేక గైరికాదిధాతువులచే నొప్పారునదియు, దివ్యౌష
ధులకాంతులతో జ్వలించుచున్నదియు, మేఘమండలముపఱ కావరించి
యున్నతమైనదియు, సకలతరుజాలములతో విరాజిల్లునదియు, నానా
విహంగమసేవితమైనదియు, సుందరాకారు లగు కిన్నరాప్సరసలవిహార
మునకు యోగ్యమైనదియు నగు నమ్మందరనగము మే మెంతయత్నముఁ
జేసినను గదలదయ్యె. మే మేమిచేయవచ్చును? మహానుభావా, ఆక

పురుషా! దీని కుపాయంబు నుడువు మని వేడఁగా నారాయణుండు సర్ప శ్రేష్ఠుండగు ననంతునిం జీజి యిట్లానతిచ్చెను. ఓయనంతుఁడా! నీవు దేవ హితార్థ మరిగి మందరనగముం బెకలించి దానిని క్షీరసాగరమునందుఁ జేర్చిరమ్ము. అనఁగా నమ్మహానాగము పరమాత్మునాజ్ఞను శిరసావహించి వెంటనే దేవతలు రాఁగా నమ్మందరనగము నవలీలఁ బెకలించి దానిని మోచికొని యశ్రమంబున బాలకడలిం జేర్చెను. అంత దేవతలు తాము మథింపఁగా నుత్పన్న మగు నమృతమునందుఁ గొంతభాగము సముద్రున కిచ్చునట్లొడంబఱిచి సముద్రమథనంబునకుఁ గడఁగువారు పర్వతము సముద్రమున మునుఁగకుండునట్లు చేయుటకై బ్రహ్మకు నారాయణునిఁ గూర్చి తపం బొనర్ప నప్పరమకారుణికుండు, భక్తులపాలిటిపారిజాతంబు, వారికిం బొడసూపి తాను మంథరపర్వతపు టడుగుభాగమును మహా కూర్మమై తనవాలంబున నప్పర్వతమును ధరించి సముద్రమథనకాలమున దానియడుగును బైకుబుకఁ బెట్టెద ననియు, నంత నాపర్వతము చక్కఁగా కవ్వముంబోలె నమరి చిలుకుట కనువై యుండుననియు నుడివెను. అంత నింద్రుండు తనవజ్రాయుధమున నాకూర్మరాజు పై చిప్పను చీల్చి సవరింపఁగా దానిపైన మంథరనగంబును ననంతునిసాహాయ్యంబున దేవత లమర్చియుండిరి. అంత వా రందఱు నేకముఖులై కవ్వముతోఁ జిలుకుటకుఁ ద్రాడుగా వాసుకిం బ్రార్థింప నావాసుకి యామహాకార్యమునకుఁ దాను బద్ధమై యుండుట కొప్పికొనెను. అంత నవ్వాసుకి తలలను దానవులును, దోఁకను దేవతలును బట్టికొని క్షీరసాగరమథనంబున కారంభించిరి. ఇట్లు చిలుకుచుండ ననంతుండు శ్రీమన్నారాయణుండును కూర్మరూపమున నున్నస్థలమును జేరి మథనసమయమున వాసుకి పడగలు పైకైగయునప్పుడెల్ల వాని నణఁచుచుండె.ఈప్రకారము మథన మాపఁబడక నిలువక కొనసాగుచుండె. అప్పుడు చిలుకుఁద్రాడైన వాసుకి వదనగహ్వరములనుండి పొగయు నగ్నియుం గూడిన నిట్టూర్పులు వెలువడెను. అవి యాకసంబున కెగసి తళతళ లాడుచుండు మెఱుపులై మేఘాకారములను దాల్చి, యలసిన దేవతలపై చల్లనివర్షమును గురియించి వారిశ్రమను బోఁద్రోలుచుండె. మఱియు మంథరపర్వతంబు కవ్వమై చిలుకుచుంటం జేసి యానగమంతయు నిటునటు చలించుచుండ

నాయదరుపాటునకుఁ బర్వతముపై నున్న చెట్లు పుష్పములను దేవతలపై రాల్చుచు వారికిఁ గొంత యుత్సాహంబు గలిగించె.

ఇట్లుపర్వతసంఘర్షణధ్వనిచే సముద్రములోని నానావిధజంతు సంతానమంతయు క్షోభమును జెంది యల్లకల్లోలమై "యిది యేమి ప్రళయకాల మయ్యెనే ?" యని భ్రమాకులితమనంబులు గలవయ్యెను. ఆమహాధ్వనికి ననేకవృక్షములు గూలెను. ఆ చెట్లతాఁకుడుచే నగ్ని కణంబు లుత్పన్నములై యామహానగమునందలి యనేకజీవరాసులను గాల్పఁదొడంగుటయు నింద్రుండు పర్జన్యుం జీఱి చల్లగా వర్షములఁ గురియుట కాజ్ఞ నొసంగఁగా నావర్షముచే పర్వతమునందు వెలువడిన యగ్ని చిల్లారి నగములోని భూతముల కన్నిటికి ముద మొదవించె. మఱియు నట్లు మథించుచుండ మంథరాచలముపై నుండు నానావిధ వృక్షములనుండి యోషధు లెల్ల నుదధిలోఁ బడినను దేవత లెంత కాలము ద్రచ్చినను నమృతంబు చూపట్టదయ్యె. కాని మథనకార్య ముచే దేవతలు డస్సిరి. అంత నిరాశులై మఱలి దేవతలు కొందఱు పితామహుం జేరి యెంతకాలమునకును నమృతంబు రాదయ్యె. మేము నిస్సారుల మైతిమి. అనఁగా నాపరమేష్ఠి శ్రీమన్నారాయణుని వేఁడి వారికి బలశౌర్యంబులఁ బ్రసాదించున ట్లనుగ్రహింపు మనెను. అంతట నయ్యాదిదేవుండు దేవతలకు దయాళుండై బలదర్పము లధికముగా నిచ్చి వారిని మథనంబునకు మఱియు నుత్సాహపూరితులుగఁ జేసెను. అంత వారు సంభ్రమంబునఁ ద్రచ్చుచుండఁగాఁ గలశోదధియందుండి చంద్రుండును, మహాలక్ష్మియు, సురాదేవియు, నుచ్చైశ్శ్రవంబును, గౌస్తుభమును బొడమెను. అంత మహాలక్ష్మియుఁ, గౌస్తుభమును శ్రీమన్నారాయణునిఁ జేరె. మిగిలిన వన్నియుఁ దేవలోకంబుఁ జేరె. అట్లు దేవదానవు లుత్సాహపూరితులై మథింపుచుండఁ దెల్లని కమండలములో నమృతమును సంపూర్ణంబుగాఁ గొని ధన్వంతరియు, నాల్గుకొమ్ములతోను వెలయుచు వెల్లనైన యైరావతం బను గజరాజ మును నుదయించెను. ఆగజరాజము నింద్రుఁడు గైకొనెను. మఱియు నుద్రేకముతో మథించుచుండఁగా దానినుండి పొగ లెగయుచు నతిభీషణంబై, లోకమును భయభ్రాంతముఁ జేయుచు, ముల్లోకములను

దనతాఁకుడు గలిగిన చోటెల్ల భస్మీభూతంబుం జేయుచు మండుచున్న దావాగ్నివోలె నలుదెసలఁ దనజ్వాలల నావరించుచుఁ గాలకూటవిషం బుత్పన్న మయ్యె. అప్పు డందఱు నామహావిషాగ్నిభయంబున కేమియుం దోఁపక నివ్వెఱపడి చూచుచుండిరి. ఆవిషాగ్నివలన నాలుగు బిడ్డయు ననక యందఱును భీతినొంది తొలఁగఁ జొచ్చిరి. అప్పుడు లోకపితామహుండు దానియురవడి సహింపలేక మహాదేవుని, శూలపాణిని, త్రిణయనుని, బశుపతిని, బినాకపాణిని, గాలరుద్రుని లోకరక్షణార్థము ప్రార్థింప నద్దేవదేవుం డావిషము నఱచేత ముద్ద నొకటిగాఁ జేసి దానిని నోట వైచికొని తనకంఠస్థముఁ జేసెను. అప్పటినుండి యీశ్వరుఁడు నీలకంఠుఁడు నాఁబడెను. ఇట్లమ్మహాదేవుండు సకలభూతములకు విషభయముం బాపఁగా నచ్చట దేవదానవులు లక్ష్మికొఱకును నమృతము కొఱకును ఘోరముగాఁ బెనఁగుట కారంభించిరి. ఇంతలో విష్ణుండు మాయామోహినీస్వరూపంబుఁ దాల్చి జగన్మోహనాకారంబున నత్యాశ్చర్యరూపముతోఁ గానిపించుటయు నాదివ్యసౌందర్యంబున కెల్లరు పరవశులై, చేష్ట లుడిగి, భయముఁ దక్కి, యామోహనాకారంబు నెల్లవారును జూచుచు నమృతముపై దృష్టిని మఱచ్చి, యామాయా వనితరూపంబునఁ దగులు చెందినమనస్సు గలవారై యాయమృత కలశము నమ్మాయామోహినిరూపముతో మోసంపువనితయైన భగవంతుని కధీనముం జేసిరి.

అంత భగవంతుఁడు తనమోహినీరూపమును జూచుటయందే లీనమైనమనస్సులు గల దానవులయంతఃకరణముఁ దెలిసి యమృతము నెల్ల దేవతలకే యొసఁగుచుండె. దేవతలును బరమప్రీతులై యమృతమును ద్రావుచుండిరి. అంత నొక్కరక్కసుం డీమోసమును దెలిసి తాను దేవరూపమును దాల్చి వారిమధ్యభాగమున నాసీనుండై యమృతమును గ్రహించెను. ఇంతలో నాకపటమును సూర్యచంద్రు లిరువురును దెలిసి యమృతము వానికంఠములోపలిప్రదేశమునకుఁ బోవక మున్న భగవంతునకు "వాఁడు రాహు వనురక్కసుం డనియుఁ గపటదేవతాస్వరూపంబున దేవతలమధ్యమునఁ గూరుచుండి యమృతమును ద్రావుచున్నాఁ డనియు సైగచేఁ దెలుపుటయు, జగన్నాథుండు చక్రప్రయోగంబున

వాని శిరంబుఁ ద్రెవ్వనేసె. అంత వానిశిర మమృతస్పర్శంబున భయంకరా రావముం జేయుచు నాకసంబున కెగసె. మొండెము భూప్రదేశమదురు నట్లు క్రిందఁబడెను. ఆవైరంబు సాధించుటకుఁగా నిప్పటికిని రాహువు సూర్యచంద్రులను గ్రహణకాలములయందు బాధించుచుండును. అంత నారాయణుండు తనకపటంపువనితారూపమును మాని శూరుండై దానవులమీఁది కుఱికి వారిని నానావిధాయుధప్రయోగములఁ గొట్టుచు నొప్పింపసాగెను. అసురులును నీమాయయంతయును సురలమోసంపు టుపాయంబు లని యెఱింగి నానావిధాయుధపరిగ్రహణంబు సేసి లవణ సముద్రతీరంబు యుద్ధభూమిగాఁ గొని మల్లచఱచి యుద్ధోన్ముఖులై నానావిధశంఖభేరీకాహళాదివివిధతూర్యధ్వానంబులనుజేసి భూమ్యా కాశమధ్యప్రదేశమును నలుదెసలును బీఁటలువాఱఁ జేసిరి. అప్పు డింద్రాదిదేవతలు తమకు భగవత్స్వరూపులే యగు నరనారాయణులు తోడ్పడఁగా యుద్ధమునకుఁ బ్రతిఘటించి రాక్షసులను గొట్టసాగిరి. దేవ దానవసైన్యంబులుచెలరేఁగిపరస్పరదూషణంబులను, బరస్పరవివిధాయుధ ప్రయోగంబులను, నానావిధాస్త్రలాఘవముల నొండొరుల్దాఁకు జూఫుట లను, బరస్పరవిదారణంబుల కొకరినొకరు పురికొల్పుటలునుగాఁ గ్రింపఁ బడిన కబంధంబులును, బగిలినఫాలంబులును,చింధరవంధరలైన వెన్నెముక లును, విఱిగిన వ్రేళ్లును, డొల్లిన డొక్కలును, గడతేఱినకాళ్లును, జర్జిత జానుజంఘలును, మొక్కపోయిన ముక్కులును, కూలిన గ్రుడ్లులును గలిగి యాయుద్ధమునందు నరనారాయణులరూపముతో నున్నభగ వంతుఁ డొనర్చినయుద్ధము నే మని వర్ణింపఁగలము? నరుని మహా ధనుస్సునుండి పుంఖానుపుంఖములుగాఁ గురియుచుండుశరసహస్రముల చేతను ఘోరాయుధంబైన నారాయణుని చక్రప్రహారంబులచేతను ఘోరాకారులైన రక్కసు లగ్నియందుఁబడు శలభంబులువోలె మ్రగ్గిరి. యమునివచ్చుచున్న కైవడిఁ నగు వారినివ్య తేజస్సునకు దానవులుభీతిల్లిగుండె లవిసి చచ్చిరి. ఈవిధముగ దానవులను దేవతలు భగవంతునిసాయమున నోడించి యయ్యమృతమును గ్రోలి యమృతకలశమును నాకలోకమునకుం గొనిపోయిరి. మంథరనగమును బూజించి యథాస్థానమునకుం జేర్చిరి.

హతశేషులైన యసురులు నారాయణునిచక్రమునకు భీతిల్లి లవణసముద్రముం జొచ్చిరి. ఇవ్విధంబుగ దేవాసురయుద్ధం బమృతహరణార్థమై తొల్లి ప్రవర్తిల్లఁగా దేవతలు గెలిచిరి. అసురు లోడి రని క్షీరసాగరమథనప్రకారం బంతయును శౌనకునకు నుగ్రశ్రవసుండు నిరూపించి వెండియు నిట్లనియె.

### సముద్రతీరంబునం గద్రూవినతలు పాలకడలియం దుత్పన్నమైన యుచ్చైశ్శ్రవంబును జూచుట

అంతట నొక్కనాఁడు కద్రూవినత లిరువురును విలాసార్థంబుగఁ, బాలకడలితీరంబున కేఁగి క్రుమ్మరుచుండువా రచ్చోట విహరించుచు, సముద్రమథనకాలంబున నాకడలియం దుండి యుద్భవమైనదియు, నచ్చునఁ బోసిన బ్రహ్మతేజమో యనఁ బరగునదియు, నీశ్వరునిజడలయం దుండు మిన్నేటియిసుకయొక్క మనోజ్ఞత గలదియు నైన యుచ్చైశ్శ్రవం బను దేవతలయశ్వరాజమును గనుంగొనిరి. అప్పు డద్దానిం జూచి వినత శరీరమునం దెచ్చటను నొక్కనల్లనిమచ్చ యైన లేక యిట్టి ధవళంబైన శరీరముతో నుండు నశ్వం బెందేని గలదే యనఁగా దానిమాటలం గైకొనక కద్రువ "నీకు దృష్టి తప్పినట్లున్నది. దానివాలంబు నల్లనై యున్నది" యనెను. అంత వినత దానియంగం బంతయుఁ గలయం బరికించి, 'కాదే యక్కా! శరీరమున నేతావునను నల్లన లేదు. నీవు విలాసమునకు నాడినమాటయా యేమి? లేక, యథార్థముగఁ జెప్పితివో? అదియునుంగాక నీకన్నులకట్లు గానన య్యెనో!' యని యడుగ, గద్రువ ముసిముసినగవులునగుచు 'నదియేటి మాట? అల్లదిగో నలుపు గోచరం బగుచున్నయది. తెరలం బలుకవలసిన దేల?' యనిపలుక విని వినత మఱల నాయశ్వరాజంబును దెలియం జూచి, "నీలిమ యెంతమాత్ర మీయశ్వంబునఁ గానరాదు." అనెను. అంతఁ గద్రువ "వృథోక్తులఁ బ్రయోజనం బేమి? పందెము నీవు చెప్పినట్లంతటఁ దెలు పుండి నీలిమ లేనిచో నేను నీకు దాసి నగుదు. కాదేని యోవినతా! నీవు నాకు దాసురాలి నగు" మనెను. అట్లు కద్రువ పందెము చఱచఁగా సహజవినమ్రస్వభావ యగువినత తనపుత్రు శాపకారణంబున నుద్రేక మడరఁ దెంపు సేసి యత్తెఱంగున కియ్యకొనియె.

వారిరువురును బంచమహాభూతంబులు సాక్షులుగా నియమించి కొనిపన్నిదంబు చేసిరి. అంతఁ గద్రువ సతిచర్యకుఁ గాలంబయ్యె. మఱల వచ్చి యశ్వరాజంబు సంగతి నాలోచింత మని నెపంబువెట్టి యప్పటికిఁ జూపఁదప్పించె.పదఁపడి వారిరువురును మగిడి యాశ్రమంబున కరుదెంచిరి. అంతటఁ గద్రువ చెడ్డతలంపుతోఁ గొడుకులగు నాగుల నెల్లవారిని రావించి, కన్నీరు గాఱుచుండ వారితో నిట్లనియె."నాయనుంగుబిడ్డలారా! నేనును వినతయును విలాసార్థంబుగఁ గడలితీరంబున కరిగి యచ్చోట నీలిమయెంతమాత్రము లేక యచ్చంపుఁదెల్లందనముతో నుండు నశ్వరాజంబుఁ గంటిమి. అప్పుడు వినత యాయశ్వంబు కేవలధవళంబ యనెను. నే నొడ్డారమునకు నల్లఁదనము వెనుకవైపున నున్న దంటిని. అంత మా యిరువురకును వాదయ్యెను. వాదంబునకు ఫలితముగ దానిమాట నిజమైనచో నేను దానికి దాసి నగునట్లును నామాట యథార్థంబైన నయ్యది నాకు దాసి యగునట్లును బన్నిదము చేసి వచ్చితిమి. నాపందెము గెలుచునట్లు మీ రెవ్వరైనం బూసుకొని దానితోఁక నల్లగానుండఁదోఁపఁజేయుఁడు."అనిపలుక వాసుకి ప్రభృతు లగు నాగంబు లధర్మమునకు వెఱచి "అమ్మా! నీవు చూచిన విధమున దానియందు నలుపు లే దని తెలియుచున్నది. కావున మేలొనఁ గూడనేరదు. మఱియును మాకు వినతయుఁ దల్లితో సమానురాలు. పక్షపాతబుద్ధితో నా దేవిని సైతము మేము చూడఁదగునే? ఇట్టిచేఁతలకు మమ్ముం బురికొల్పుదే? ఎట్లైనను, బాపమున కెట్లొడిగట్టుదుము?" అని చెప్పఁగాఁ గద్రువ వారితో నెవ్విధమునైన నా తలంచినకార్యంబును మీ రొనర్పవలయు ననఁగా నాగులు మేము పరదేశములకైనం బోయి జీవింతుము కాని, యోతల్లీ! నీ యిప్పని చేయఁజాల మనిరి. అట్టియెడం గొందఱు తల్లిం దొరఁగి యెక్కడికేనిఁ జనిరి. అట్లు పోయిననాగకుమారులయెడఁ దల్లి కనలి నెనరులేక నిష్ఠురముగా నిట్లని శాపం బిచ్చె. ఇఁకమీఁదఁ జంద్రవంశమునఁ బుట్టుపాండురాజుదేవి యగుకుంతిగర్భమందు ధనంజయాదినామములతో వెలయు వానికుమారుని మనుమఁడు జనమేజయుం డనునృపా

లుండు ధర్మముతో భూపరిపాలనంబుఁ జేయుచుండఁగా నామహానీయుండు సర్పయాగ మను నధ్వరమును గుపితాత్ముఁడై పితృప్రీతికై చేయును. ఆయాగాగ్నియందు మీ రెల్లరు మంత్రాహూతులై వచ్చి పడియుదురు." అనెను. ఈశాపంబును దక్కటిభుజంగములు విని తల్లి యొద్దకేఁగి భీతులై, అమ్మా! మేము వోయి యాయశ్వరాజంబు వాలముంబొదివి నల్లనై తోఁచునట్లు చేసెద మనివెంటనే యుచ్చైశ్శ్రవముయొక్క తోఁక నొక్కనల్లని పాము మ్రింగి దానితోఁకను నలుపుగాఁ దోఁపించె.

కద్రువ తనపుత్రుల కిచ్చినశాపమును సురలచే బ్రహ్మ విని యిట్లనియె. ఈక్రూరంపుఁ బురువు లగునాగులు తమవిషవేగంబున లోకములకెల్ల మహాపకారంబుఁ గావించుచున్నారు. వీరికిఁ గద్రువ యొసంగిన శాపం బుచితంబ. పరద్రోహచింతనంబున నుండువార లెవ్వరికైన నిట్లే ప్రాణాంతకంబైన శిక్షను దైవ మేర్పాటుఁ గావించు"నని కద్రువను గొనియాడి శాపంబును బితామహుం డామోదించెను. మఱియు నీకద్రువ శాపంబునం జేసి యాదేవిభర్త యగు కశ్యపుం డేమి సేయునో యని తలంచి యాబుషివర్యుం బిలిచి బ్రహ్మదేవుం డిట్లనియె. కశ్యపా! కద్రువ నీపుత్రుల కొసఁగిన శాపంబునకు మనంబునఁ బుత్రస్నేహంబుం జేసి కలఁత నొందకుము. నాగులు లోకద్రోహులు. వా రీశాపముచే మడియుట కర్హులు. మఱియు జనమేజయనృపాలుండు గావించు సర్పయాగమునందు నాగులకు వినాశంబు పూర్వమే నిర్ణీతమైయున్నది. అని చెప్పి విషహరంబగు విద్య నాతని కుపదేశంబు గావించి యతనివంతఁదీర్చి ప్రసన్నుం జేసి బ్రహ్మ నిజలోకమున కరిగెను.

అంత నారాత్రి గడచి ప్రభాతం బగుటయు నాకద్రూ వినతలు తమతమయాడినమాటలయాథార్థ్యం బొండొరులకుఁ దెలియఁజేయు తలంపులం గొని పన్నిదంబు గెలుచునుత్సుకమంబునఁ, గరువలిచే నెగురఁగొట్టంబడుచు నున్నతంబులైనకరుళ్లు గలదియు, నలలవేగంబున మహాస్వనంబుతో సంక్షోభ్యమానమై యుండునదియుఁ, దిమింగిలాదిమహామత్స్యములకును గొప్పమకరములకును నెలవై యుండునదియుఁ, బాతాళ

వాసు లగు రక్కసులకు నిలయమైనదియు, భయమును గలిగించు మహాసత్త్వముల కిక్కయైనదియు, నమర్త్యులగు దేవతల కాహారమై శుభప్రదమై, దివ్యమైనయమృతమున కునికిపట్టైనదియు, నప్రమేయమును నచింత్యమును విస్తృతమును నగుచుఁ బవిత్రోదకములతో నొప్పారుచున్నదియు, నానానదీప్రవాహసమ్మిళితమైనదియు, నెల్లప్పుడు చలుగని యుదకములతో నగాధంబై నదియు నగుపారావారంబును జేరిరి. అంతకు మున్నుగానే, కద్రువభయంబునంగర్కోటకంబనునల్లత్రాచుపాముచ్చైశ్శ్రవంబువాలమును మ్రింగి నల్లగఁ దోఁచునట్లు చేయఁగా వినత దానిం జూచి, విషణ్ణహృదయయై కద్రువ గెలిచె నని దిగఁబాఱినమనంబుతోఁ బన్నిదంబు మేరకు దాస్యమున కియ్యకొనెను. కాని కద్రువకు దాసురాలు కావలసివచ్చె నే యని ఖిన్న చేతస్కురా లయ్యెను. ఇట్లధర్మంబునఁ గద్రువ పరమసాధ్వియగు వినతను మోసముచేఁ దనకు దాసిగాఁ జేసికొని వరవుడంపుఁబనులకు నియోగించుచుండె.

## గరుత్మంతుఁడు జన్మించుట

ఇట్లుండ వినత రెండవయండంబు సకాలంబు కాఁగా నవిసెను. దాని నుండి సమస్తదిక్కులను స్వప్రభలచే వెల్గించుచుఁ గామరూపుఁడును, గామగమనుండును,వీర్యవంతుండును, మహాబలపరాక్రముండును, మెఱుపుఁదీఁగవంటి పచ్చనికనుఁదోయి గలవాఁడును, నతిభయంకర రూపుఁడును, నగ్నిరాశివోలెఁ బ్రకాశించుచున్నవాఁడును, మహాకాయుఁడును నగు పక్షీంద్రుండై నగరుత్మంతుఁడు రెండవయగ్నిహోత్రునివలెఁ బ్రకాశించుచునాకసంబున కెగిరెను.అట్టిఘోరాకారుండును, ఘోరకంఠధ్వని గలవాఁడును, నపరాగ్నిహోత్రుఁడు నాఁబరగు గరుత్మంతుని నిర్జరులు వీతిహోత్రుంగాఁ దలంచి, యగ్ని నుపాసించుచు నిట్లనిరి. "ఓయగ్నిహోత్రుఁడా! మున్నెన్నఁడైన నీ విట్లు మాకుఁ గీడుసేయఁ బూనియున్నాఁడవే? ఇపు డేల నీ విట్లు ప్రజ్వరిల్లి విజృంభించుచున్నవాఁడవు? ఇవె నీజ్వాలలు మమ్ముఁ జుట్టుకొని వచ్చుచున్నవి. ఉపశమిల్లి నీప్రతాపము నడంపుము." అని ఇట్లు దేవతలు వీతిహోత్రుం బ్రార్థింప నాయగ్నిదేవుండు వారల

కి ట్లనియె. "దేవతలారా! ఈవెలుంగుచున్న మహాపురుషుండు వినతా నందనుం డగు గరుత్మంతుఁడు గాని, నేను గాను. ఇతండు కాంతియందు నాకు సమానుండు. మిగుల బలవంతుఁడు. కశ్యపసూనుం డగు నీమహా నీయుండు సదా దేవతలకుఁ బ్రియంబును, దేవారాతుల కప్రియం బును నాచరింప బ్రహ్మచే సృష్టింపఁబడియె. మిక్కిలి కాంతియుతుండైన యీమహానీయుం గాంచి మీరు భ్రమఁజెందితిరి. ఈసందర్భమున మీరు భీతిఁ జెందవల" దనఁగా సురలాతేజోమూర్తిని గరుడుం గా నెఱింగి వానికి దూరంబుగ నిలిచి యమ్మహనీయు నిట్లు స్తుతించిరి. "ఓమహాత్మా! నీవు మహర్షివి, పతగేశ్వరుండవు, సకలమంత్రస్వరూపుఁడవు, ప్రజాపతి యగు పరమేష్ఠివి, నీవే యింద్రుండవు, నీవే జగత్పతివి, నీవే సమస్తవేద ములు, నీవే యగ్నివి, నీవే వాయువవు. నీవే ధాతవు, విధాతవు, లోక రక్షకుండును, విశ్వవ్యాపకుండును నగు విష్ణుండవు. నీస్వయంప్రకాశత్వ ముచే రెండవసూర్యునివోలె జగంబులను గాంతిమంతంబుగఁ జేయు చున్నాఁడవు. ప్రళయాగ్నింబోలె నెల్లలోకంబుల దహింప నుద్యుక్తుండ వైతివి. ఈచరాచరము లగు సర్వభూతములలో నీ వుత్తముండవు. పక్షీంద్రుండ వగు నిన్ను దేవతల మగు మేము సకలలోకహితార్థంబు శరణనుచున్నాము. నీగతికి భీతిల్లి యాకసమునఁ దిరుగాడు సర్వజంతువు లును దొలంగి పాఱుచున్నవి. పిడుగువంటి నీమహాధ్వని మాగుండెల నవియించుచున్నవి. కృపాళుండవై యీయుగ్రరూపము నుపసంహరించి శాంతింబొందుము. మమ్ము దీనుల ననుగ్రహింపుము. సురల మగు మమ్ము రక్షింపుము. రక్షింపుము." అని ప్రార్థించిరి. ఆ దేవతల మొఱల నాలైన తేజముం డాలించి భయంకరంబైన తనరూపునకు దేవతలే భీతిల్లి రని తలంచి యాఘోరరూపంబును దివ్యతేజంబును నుపసంహరించి కశ్యపాశ్రమ మున నున్న తనపూర్వజుపాలికి నరిగి తేజోరాశి యగు వానిని తనవీ పెక్కించికొని వినతపాలి కరిగియచ్చోటనుండి పారావారం బావలిగట్టుం జేరి పూర్వదిక్కునందు జగంబులఁగాల్ప యత్నించుచున్న సూర్యున కడ్డంబుగాఁ దనయన్న యగు నాయరుణుని నిల్పి పదంపడి నిజనివాసమున నున్నతల్లియొద్ద కేతెంచి తెలిపెను. అది విని శౌనకుండు సూర్యుం డేల

జగంబులఁ గాల్పందొడంగె. ఈవృత్తాంతమంతయు విస్తరించి చెప్పవే యనిసూతనందనుం డగునుగ్రశ్రవసు నడుగఁగా నాతం డమ్మునికిట్లనియె.

సూర్యున కనూరుండు సారథి యగుట

ఈవృత్తాంతంబును రురుండు తండ్రి యగుప్రమతి నడుగఁగా నాతండుసుతున కిట్లు వివరించె. దానిని మీకు విన్నవించెద. తొల్లి యమృతవిభాగసమయమున రాహువు దేవతలం గలిసి యమృతంబు గొనఁగా నయ్యది సూర్యచంద్రు లెఱింగి నారాయణునకుఁ గనుసన్నం జేయ భగవంతుండు చక్రము ప్రయోగించి రాహువు కంఠంబుఁ దెగవ్రేసె. కాని యయ్యది యమృతస్పర్శనంబున సప్రాణంబై యుండి నాటంగోలె సూర్యుని బాధించుచుండె. అంత నావేయికిరణంబులవాఁడు తాను లోకములకును నిర్జరులకును హితం బాచరించుచున్నను దన్ను రాహువు బాధించుచుండ నెల్లరును వారింపక దీనిం జూచుచున్నవా రని యలిగి యొక్కనాఁ డస్తాద్రిం జేరి, యారేయి మధ్యకాలమునఁ దటాలున నుండి వెలుంగుచునుండె. అంత నద్దాని మునులు గని, యేలొకో నడిరేయి భానుం డిట్లు వెలుఁగుచున్నవాఁ డని భీతిల్లి యందఱును వేల్పులపాలి కరిగి యీవైపరీత్యమును జెప్పఁగా వేల్పులు చేయునది గానక యమ్మునులం దోడ్కొని బ్రహ్మపాలి కరిగిరి. అప్పుడు వారెల్లరు నేకీభవించి భానుం డీపగిదిఁ బ్రజ్వరిల్లుట జగన్నాశహేతుభూతంబై తోఁచెడి నని 'పితామహునితోఁ జెప్పఁగా నాపరమేష్ఠి భానునకు రాహువపకారము నేయుచుండ దానికిఁ బ్రతీకార మెవరును దలంపకున్నా రని భానుం డలిగి యిట్లు ప్రజ్వరిల్లుచున్నాఁ డనిచెప్పి యిందులకుఁ బ్రతీకారముగా గశ్యపసూనుం డరుణుం డనువాఁడుసూర్యునకు సారథి యయ్యెనేని సూర్యరథంబున సూర్యునకు ముందుగాఁ గూర్చుండి రాహువున కడ్డపడఁగలఁడు. అంత రాహువు సూర్యుని బాధింపలేఁడు. అనూరునివలన సూర్యుండు రాహువుబాధనుండి తప్పించుకొనఁగలఁడు. దానం జేసి లోకంబులకుఁ గీడు సెందదు. అని చెప్పి యరుణుని సూర్యునకు సారథ్యంబు సేయ నాజ్ఞాపించె. అరుణుండు పూర్వకాయముమాత్రము విధిప్రేరణచేఁ గలిగియుండుటచే వాఁ డూరువులు లేక కశ్యపాశ్రమమం దింతకాల మున్నవాఁడు. కావున వాఁ డచ్చోటునుండి కదల లేకుండెను.

ఇప్పుడు వానికి దమ్ముండును, మహాబలుండును, దీప్తిమంతుండును, గొప్పకాయము గలవాఁడును నగు గరుడుఁ డుద్భవిల్లుడు నన్న యగు ననూరుని మోచికొనిపోయి తూర్పున భానుం డున్నస్థలమున డించి వచ్చె నని రురునకుఁ బ్రమతి సూర్యకోపకారణంబును సన్మహాసీయు నకు వైనతేయుం డగునరుణుండు సారథియైనవిధంబును జెప్పఁగా దా నెఱింగినయవ్విధము నంతయు సూతుండు శౌనకునకుఁ జెప్పి వెండియు ని ట్లనియె.

ఇవ్విధమున గరుడుండు తనయన్న యగు ననూరుని భానుని నొద్ద జేర్చి పిదపఁ దల్లియొద్ద కేతెంచి తల్లి కద్రువశంబున ననుభవించుచున్న దాస్యమునకుఁ దాను దోడ్పడుచుండ నొక్కనాఁడు కద్రువ వినతం బిలిచి యిట్లనియె. వినతా! సముద్రమధ్యంబున రమణీయంబై, నానావిధ మలతాసంశోభితం బైననాగాలయం బున్నది. అచ్చోటికి నన్ను నాగ కుమారులను మోచికొని పొమ్మనెను.అంత వినతయు "సహశ్యమనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్" అన్నట్లు నేమియు మాఱాడనేరక కద్రు వను దా మోచికొని దానికుమారులయిన నాగులను గరుడుని మోవం బనిచి వియత్తలంబునఁ బోనుద్యుక్తురా లయ్యెను. అప్పుడు గరుడుండు తల్లివచనంబున నాగుల నెత్తికొని సూర్యున కెదురుగా నాక సంబున నిండెత్తుగఁ బఱచుచుండఁగాఁ బాములు సూర్యునికిరణముల వేఁడికి సహింపలేక మూర్ఛిల్లిరి. అంతఁ గద్రువ తనసంతానముపడు పరి తాపముం జూచి వారికి శ్రమమువాయ మహేంద్రుని వర్ణించుచున్నట్లు ప్రార్థనాపూర్వకముగ నిట్లని స్తుతించె. "ఓ మహేంద్రుఁడా! నీవ స్వర్గ స్యాధికారివి. సర్వాయుధములలో శ్రేష్ఠమైన వజ్రమును బాణి యందు ధరించుటంజేసి నీవు వజ్రపాణి వనఁబడెదవు. సర్వలోకములకు సృష్టికర్తవు నీవ. సర్వలోకములను లయముచేయువాఁడ వీవ. నీవ విష్ణువవు. నీవ దేవాదిదేవుఁడవు. సర్వప్రపంచమునకు నీవ పరాయ ణుండవు. నీవ యమృతస్వరూపుఁ డగుసోముఁడవు. నీవ కాలస్వరూపివి. రేపవలతోను మాసర్తువులతోను గూడినసవత్సరంబ వీవ.. సర్వదేవాత్మ కుండ వీవ. సకలపదార్థస్వరూపుండవు నీవ. యాగంబులయందు బుత్విక్కులు నిన్నుద్దేశించి యగ్నియందు హవిస్సు వైవఁగా నగ్ని

ముఖంబున నాపురోడాశంబును గొని సంతృప్తుండ వై యాజకుల మనోరథంబులఁ దీర్చువాఁడ వీవ. గిరినదీజనపదములతోఁ గూడిన యీధరాతలంబున నున్నవారిలో నీ వుత్తముండవు. వియత్తలంబున సహస్రకిరణములతోఁ దనయుదయంబునం జేసి ప్రపంచాంధకారంబును నావలికి నెట్టుచున్న తేజోమూర్తియగు సూర్యునికన్న నీవ యధికుం డవు. తిమితిమింగిలాది మహామత్స్యములతోను మహామకరంబులతోను నున్నతమైన యలలతోను సదా ఘోషించుసముద్రునకంటె నీవ శ్రేష్ఠుం డవు. వీని నెల్లను బ్రవర్తింపఁజేయువాఁడ వీవ. నీవు మహాయశశ్శాలు రచే నెల్లప్పుడును బూజింపఁబడువాఁడవు. మహామేధావులగు ఋషి శ్రేష్ఠులు నిన్ను సంతోషింపఁజేయువారై యాగముల నొనరించి సోమ పానము గావింతురు. వషట్కారములతో నప్పుడు నిన్నాహ్వానించి జేసి నీ కగ్నియందు వ్రేల్చిన పురోడాశము నొసంగి తృప్తిపఱచి నిన్ను సకల లోకములకు మేలుఁ గావింపఁగోరుదురు. నిన్ను విప్రులు సదా వేద వేదాంగమంత్రములం బాడి యానందింపఁజేయుటకొఱకు యజ్ఞములం గావింతురు.” అని మేఘవాహనుం డైనమహేంద్రుని కద్రువ నుతింపఁగా బలాహకుండు సంతసించి కద్రువ సంతానముపైఁ గరుణించి మేఘములను వర్షించున ట్లాజ్ఞాపించెను. అంతఁ బర్జన్యుండు సూర్యచంద్రకిరణంబుల ప్రసార మొకింత యేని లోకంబునఁ గానరాకుండ నాకసంబునఁ దన విస్తారమగు నల్లనిశరీరంబుతో నావరించి భయంకరంబుగ నుఱిమి యంధ కారమును క్షణ క్షణ ప్రసారమున మిఱుమిట్లు గొల్పు మెఱుములతో నవియించుచు, సంతతధారాపాతంబున లోకమున నెటు చూచినను నీరా మనిం జేసి, కద్రువసంతానంబులకుఁ దాపోపశమనంబుచేయఁగాఁ గద్రువ మిక్కిలి యానందించె. ఇవ్విధమునఁ గద్రువను వినతయు, నాగకుమారు లను గరుడుండును, మేఘముచే నావరింపఁబడి ప్రబలాంధకారమయం బైన వియత్తలంబున మోచికొనిపోవుచుండ నానాపక్షుల కలకల ధ్వనులతోఁ గూడి చిత్రవిచిత్రము లైనరంగులతో నేపుమీఱి నేత్రా నందము గలిగించుచుండు పలుతెఱంగు లైన వృక్షసమూహములతో నుండునదియు, కమలములయందలి తేనెను సంతతము పానముచేయుటచే మదించినమధుపములఝంకారరవంబులచే నొప్పి నిర్మలమధురశీతోద

కంబులతో నుండు కొలంకులు గలదియు, నున్నతసౌధరాజంబులతోఁ జెన్ను మీఱి, యాప్రదేశంబులవాసంబుల నేర్పఱచుకొనినవారిపైఁబూల వాన గురియువిధంబునఁ బుష్పముల రాల్చుచు నప్పటప్పటికిఁ గొత్త నెత్తావులం దెచ్చు చల్లనిపిల్ల తెమ్మెరల మెల్ల మెల్లని సంచారంబున కునికిపట్టై నాగ గంధర్వ కిన్నర కింపురుషాంగనలకు విహారస్థానంబై, నిడుపులైన పూలదండలంబోలెఁ దీరంబుల నప్పు డప్పు డతిమనోహరంబుగ నొరయుచున్న కడలియలలతో రమ్యంబైనయదియును, సర్వమానవ మానసోల్లాసకరమైనదియును, దేవశిల్పి యగు విశ్వకర్మచే నిర్మింపఁబడినదియును మహార్ణవమధ్యంబున నుండునదియు నగు నాగాలయముం జేరిరి. అచ్చోటఁ గద్రువ తన సంతానముతోఁ గొన్నినాళ్లు యథేష్టముగ సంచరించి గరుడుం జూచి మమ్మిట్టిరమ్యంబైన యేదేని మఱియొకద్వీపంబునకుఁ గొనిపొమ్మని చెప్పఁగా గరుడుండు తల్లితో "అమ్మా! వీరిమాటలను మన మేల యిట్లు వినయవిధేయులమై చేయుచుండవలయును. దీని కొక్క కాలమునకు నైన నంతముకానరాదే" యనఁగా, వినత మహాతేజస్వియు, బలపరాక్రమశాలియు నైన కుమారుఁడగు గరుడునితో నిట్లనెను. "కుమారా! నేను విధిప్రేరణంబునను గద్రువ మోసంపుఁగృత్యంబునను సవతాలికి దాసురాలనైతి. కావున నీయూడిగ మవశ్యము మనకుఁ గర్తవ్యమైనది." యనఁగా గరుడుండు విన్నవోయినమనస్సుతోను జెన్ను దఱిగిన ముఖకాంతితోను గొంతయాలోచించి కద్రువను నాగకుమారులం జూచి యిట్లనెను. "అయ్యలారా! మే మెద్దాని నాచరించినచో మీరు మమ్మీదాస్యమునుండి వదలెదరు?" అనఁగా దానికి నాగులిట్లనిరి. "గరుఁడా! నీవును నీతల్లియు మాకుఁ జేయవలసిన వఱవడంపుఁ బనులబాధ్యతను దొలఁగించుకొనుట కిష్ట మేని నీవు నాకంబున కరిగి యచ్చోట నుండు నమృతమును మాకుఁ దెచ్చియిమ్ము." అనఁగా గరుడుండు వల్లె యని తల్లియైన వినతను సమీపించి "అమ్మా! నాగుల కమృతంబుఁ దెచ్చి యిచ్చి నీదాస్యవిమోచనమును జేయించుకొనునట్లొడంబడితి. నే నిప్పుడ దివంబున కెగురవలయు, నాకుఁ దగిన యాహారంబుఁ జెప్పుము" అనఁగా వినత బలాఢ్యుఁడైన పుత్రున కిట్లనియె.

గరుడుం డమృతమును దెచ్చుటకుఁ దల్లి యనుమతిఁగొనుట

"పుత్రా! సాగరమధ్యంబున బోయపల్లె యొండు గలదు. అందు బోయలు వేయిమంది గలరు. ఒక్కపెట్టున వారినందఱను దినుము. వారలలో విప్రుం డెవండైన నుండెనేని ప్రమాదంబున నైన వానిం భక్షింపకుము. విప్రుని తేజస్సు సూర్యాగ్ని తేజస్సులకంటె మిక్కుటంబు. వాఁ డలిగెనేని వానికోపాగ్ని నీకు హానిఁ జేయు. విప్రుండు లోకములో నుండు సర్వభూతములకుఁ బూజనీయుండు. కావున నెవ్విధము నను వాఁడు చంపఁదగనివాఁడు. కావున సర్వకాలావస్థలయందును విప్రజాతి కెగ్గు సేయక వర్తించితివేని నీకు శుభంబు లొనఁగూడును" అని చెప్పఁగా గరుడుండు తల్లి కిట్లనియె. "అమ్మా! నిషాదులం గలిసి యుండు విప్రుని నే నెట్లు గుర్తింతు." ననఁగా వానికి వినత యిట్లనియె. "వత్సా! నీ వెవ్వని మ్రింగఁగా వాఁడు నీకంఠబిలముఁ జొరక జీర్ణము కాక, గొంతును దహించుచుండునో వాఁడు బ్రాహ్మణుఁ డని గుర్తింపుము" అని చెప్పి యమృతహరణార్థము పుత్రునిఁ బోవ ననుమతించి వాని నిట్లు దీవించెను.

"ప్రీతా పరమదుఃఖార్తా నాగైర్విప్రకృతా సతీ,
పక్షౌ తే మారుతః పాతు చంద్రసూర్యౌ చ పృష్ఠతః.
శిరశ్చ పాతు వహ్నిస్తే వసవః సర్వత స్తనుమ్,
అహం చ తే సదాపుత్ర శాంతి స్వస్తిపరాయణా.
ఇహాసీనా భవిష్యామి స్వస్తికార్యే రతా సదా,
అరిష్టం వ్రజ పంథానం పుత్ర కార్యార్థసిద్ధయే."

నాగులు గావించుచున్న మహాపకారముచే దుఃఖించినమనస్సు గల వినత తనపుత్రుండు దాస్యవిమోచనార్థ మమృతమును వారికిఁ దెచ్చి యిచ్చెద ననఁగా సంతసించి "తండ్రీ! నీవు కార్యార్థివైపోవు చోటను బోవుచుండునపుడును నీ ఱెక్కలను వాయుభట్టారకుండును, నీవీఁపును సూర్యచంద్రులును, శిరస్సు నగ్నిదేవుండును, సర్వావయవముల నష్టవసువులును రక్షింతురు గాక! నే నిచ్చోటనుండి నీ కభ్యుదయ మొదఁగూడునట్లును, నీవు మార్గమున సుఖివై కార్యసాధనము

గావించికొని వచ్చునట్లును యత్నించెద." అని చెప్పఁగా గరుడుండు వియత్తలంబున కెగసి వాయువేగంబున నిషాదాలయంబుఁ జొచ్చి మిక్కిలి గొప్పదైన తననోరుం దెఱచి వారి నొక్కపెట్టున మ్రింగుచుండె. అప్పు డొకవిప్రుండు వానికంఠబిలంబునం జేరి లోనికిఁ జొరక దానిని దహింపుచుండుటఁ దెలిసి గరుడుం డాతఁడు విప్రుఁడు గానోపు నని యెఱింగి, 'భూసురవర్యా! మహాపాతకం బగు బ్రాహ్మణవధ నేఁజేయ లేను. నీవు నాదేహమునఁ జచ్చి నాకామహాపాతకంబు నొడిగట్టకుము. ఎటు లైనను వెలువడి ర' మ్మనఁగా నావిప్రుండు 'నాకు నిషాది యొక్కతె భార్యయు నున్నది. దాని విడిచి నే నొక్కండ రాలే' ననఁగా గరుడుండు భూసురునితో నానిషాదిని సైతము వెడల నంగీకరించెను. ఆవిప్రుం డంత నిషాదితో గుహావంటి నోటివెలుపలికి వచ్చి యథేచ్ఛగా సంచరించె. పిదప వినతాపుత్త్రుం డొక చోటఁ దపంబు గావించుచుండు తండ్రి యగుకశ్యపుపాలి కేఁగి తన్నెఱుకపఱచి 'తల్లిదాస్యమును వొలఁగించుట కమృతమును దెచ్చుటకై నాకంబునకుఁ బోనున్నవాఁడ. సముద్రమధ్యమున నున్నవేయిమంది నిషాదులఁ గబళించి యాఁకలియుడుపుకొనుటకు యత్నించితి. కాని, నాయాఁకలి యంతటితోఁ దనియదయ్యె. అమృతమును దేఁబోవు నాకు నిండుగ జవసత్త్వముల నొసంగునాహార మెద్దియేని యనుగ్రహింపు' మని వినయపూర్వకముగఁ జెప్పుకొనఁగాఁ గశ్యపుండు ప్రతాపశాలియైన పుత్త్రపూన్కికి మెచ్చి వాని కిట్లనియె.

పూర్వంబున నిరువురన్నదమ్ము లేకీభవించి కాపురంబుఁ జేయుచుండిరి. వారిలోఁ దమ్ముండు సుప్రతీకుం డనువాఁ డన్నవిభావసుతోఁ దనకుటుంబభాగమును బంచియి మ్మని పలుమాఱు లడుగుచుండ సుప్రతీకున కలిగి యన్న యిట్లనియె. విభజించుకొనుట యుత్తమంబు గాదు. ఒక్కటిగా నైకమత్యముతో నున్నకుటుంబములోనివారికిఁ బరస్పరము స్పర్ధలు వెట్టి దుష్టుండు విభజించుకొనుట ధర్మ మందురు. విచారింప నయ్యది యయోగ్యంబు కావున విభాగంబు వల దని పలుతెఱంగులఁ జెప్పినను దమ్ముండు సుప్రతీకుం డన్నమాటవినక విభజన కొకే పట్టును బట్టుడు నన్న కుపితుండై తమ్ముని మూఢమైన యేనుఁగుజన్మ మెత్తు మని

శపింపఁగా దమ్ముం డన్నను దాఁబేలు కమ్మని ప్రతిశాపం బొసంగె. ఇట్లా యిరువు రన్యోన్య శాపములచే నొక్కండు మూఁడు యోజనంబులపొడవును పదియోజనంబుల వెడల్పును గలతాఁబేలుగను, వెఱవాఁ డాఱు యోజనంబులపొడవును పండ్రెండుయోజనంబులనిడివియుం గల గజముగను నై యొక కాననంపుసరోవరసమీపమునఁ బూర్వద్వేషంబున మూఢాత్ములై పెనంగుచుండువారు. నీ వాసరస్సునకుఁ జని వాని రెంటినిం బట్టికొని నీ కాహారముం జేసికొనుము. ఆయాహారమున నీవు బల్లిదుండవై యమృతహరణార్థము నాకంబున కేగుము. అచ్చోట నిర్జరులతో నీకు సమరం బైనను విజయంబు గల్గును. నీకు శుభప్రదమగు మంగళం బగునుగాక! యని గరుడుని వీడ్కొలిపెను.

## గరుడుండు గజకచ్ఛపంబులం బట్టికొని కశ్యపునొద్ద కేఁగుట

అంత గరుడుండు పక్షవిక్షేపంబుఁ జేసి గజకచ్ఛపంబులు పోరాడుచుండుసరస్సును సమీపించి యా రెంటిని మెలఁకువతోఁ దనవాఁడిగొప్పనఖంబులం దిరికించికొని వియత్తలంబున కెగిరి మహావేగంబునఁ బోవువాఁ డలంబసతీర్థం బను ప్రదేశంబున వాని రెంటి నదిమిపట్టుకొని వానిం బెట్టికొని భక్షించుటకుఁ దగుస్థలంబును నెమకుచుండ నచ్చో నూఱుయోజనంబులు పొడవుగల యొకమఱ్ఱిచెట్టు గరుడుం జూచి దీర్ఘంబగు తన కొమ్మపై వాని నుంచుకొని భక్షింపు మని చెప్పఁగా గరుడుం డందుల కియ్యకొని యావృక్షశాఖలలో మిక్కిలి లావెక్కినదియు బహుదీర్ఘమైనదియు నగు నొక్కకొమ్మపై నాగజకచ్ఛపముల రెంటినిం బెట్టుట కుద్యమించి తనపాదముల నాకొమ్మపై నూఁదగా నమ్మహావిటపి దీర్ఘశాఖ పెళపెళ మనుధ్వనితో విఱిగెను. ఆకొమ్మ నాధారముగఁ గొని సూర్యకిరణము లాహారముగాఁ గొందఱు వాలఖిల్యఋషులు తపంబుఁ జేయుచుండిరి. అప్పు డాకొమ్మ క్రిందఁ బడినచో నమ్మునులు తమతపస్సునకు భంగము గలుగుటం జేసి తన్ను శపింతు రను వెఱపున గరుడుం డాశాఖను ముక్కునం గఱచి యెత్తి, కాలిగోళ్లయం దాగజకచ్ఛపంబుల రెంటిని చిక్కఁబట్టుకొని యాకసంబునఁ బోవుచు నాశాఖను దగుస్థలంబున విడుచుట కనువు లేక యాలోచించుచుండ నాకొమ్మయందు వ్రేలాడుచుండు మహర్షు లితరుల కసాధ్యం

